


### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు 4-50. న.పై. అర్థసంవత్సరపు చందా రు. 2-25. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి 40 న.పై. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.





# మనకు నచ్చినవి-
# మనము మెచ్చినవి

చేనేత అలంకరణ వస్త్రాలు కన్నులపండువ చేస్తాయి. ప్రాచీన, నవీన రీతుల మేళవింపువలన, వివిధ వర్ణాల శోభవలన ఎంత సామాన్య గృహమైనా ఈ అలంకరణ వస్త్రాలతో ఎంతో మనోహరంగా కనపడుతుంది.

కేవలమూ కంటికి ఇంపుగా ఉంటాయనే భారతీయ చేనేత వస్త్రాలకి మన్నన లభించలేదు—అవి సుందరమైన నేత, వాడుకవలన గాని, వాతావరణంవలన గాని ఊరని పక్కా రంగులు—ఇందువలననే దేశమంతటా ఆఫీసులలో, హోటళ్లలో, క్లబ్బులలో గృహాలలో - తెరలు మొదలైనవాటికి చేనేత వస్త్రాలు ఉపయోగిస్తున్నారు.

# చేనేత వస్త్రాలు

—మనందరకూ ముచ్చటైనవి




ఆల్ ఇండియా హాండ్‌లూమ్ బోర్డు
షాహిబాగ్ భవనం, విఠెట్ రోడ్, బొంబాయి.

DA.58/221

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను సంపాదించుట
కేర్పడిన సచిత్ర మాస పత్త్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగు ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౩౨] నవంబరు 1958 [సంచిక ౧౧

# వి ష య సూ చి క







కాశీలోని భారత కళాభవనంలోని 18-వ శతాబ్దమునాటి చిత్రకళా నైపుణ్యాన్ని చాటే చిత్రాలు

1. గోపికా వస్త్రాపహరణము  2. కుందేలు వేట,




జయజయ గృహలక్ష్మి శ్రీసఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# కళలద్వారా చిత్త సంస్కారము

మానవ జీవితముపై కళల ప్రభావము అమోఘమైనదను అంశము వివాద రహితమయినది. అందుకుగాను కళలు యావత్ప్రజానీకమున కందుబాటులోనికి రావలసియున్నవి.

సంగీతము, నృత్యము, చిత్రలేఖనము శిల్పము, నాటక కళలలాంటి కళలు ప్రజల సొత్తు కావాలి. అంటే అవి నేర్చుకోడానికిగాని, తమ కళాకౌశలమును ప్రదర్శించుటకు గాని, పిపాసతో కళారాధన చేయుటకుగాని ప్రజలు తమ స్థిమితమునకు మించిన వ్యయప్రయాసలకు లోనుకావలసి వచ్చినచో కళలు వర్ధిల్లుటకుగాని, కళలయొక్క ప్రభావము ప్రజాజీవితముపై ప్రతిఫలించుటకుగాని అవకాశములు చాల పరిమితమగును.

కళలు జాతీయ విద్యావిధానములో పొందుపరచబడాలి. విద్యావిజ్ఞానాలతో

బాటు కళలు సయితము కలిమిలేముల కతీతంగా ప్రతియొక్కరికి అందుబాటులోకి రావాలి. కళాప్రదర్శనానికి రంగస్థలాలు విస్తృతము కావడముతోబాటు కళాకారులు తమ నైపుణ్యమును ప్రదర్శించుటకు అవకాశముండాలి. అట్టి ప్రదర్శనలకు వెళ్ళి చిత్త సంస్కారము పొందడానికిగాని, ఆనందించడానికిగాని అవకాశాలు ఏదో ఒక వర్గానికి పరిమితం కాగూడదు.

ఈ నాడు సంగీతము, నృత్యములాంటి కళలను నేర్చుకోడానికయినా లేదా ప్రదర్శనల కెళ్ళడానికైనా ఆర్థికస్థిమితం ప్రధానావసరంగా కనుపిస్తున్నది. ఆర్థికస్థిమితము లేనివారు, కళలనే వృత్తిగా స్వీకరించి జీవనోపాధిగా చేపట్టినవారి జీవితాలపై కళలప్రభావము తృప్తికరంగా ప్రతిఫలించుటలేదు. ప్రతిఫలించినా ఆ చిత్త సంస్కారము ఉత్తమ స్థాయికి చెందనిదిగా నుండటంకద్దు.

ఒకానొకప్పుడు రాజులు, రారాజుల ఆస్థానాలు, దేవాలయాలు కళాకేంద్రాలుగా, విద్యావిజ్ఞాన కేంద్రాలుగా నుండినవి. ఇప్పుడు రాజులు, ఆస్థానాలు లేకపోయినా దేవాలయాలయినా కళా కేంద్రాలుగా వర్థిల్లడానికి అవకాశాలుండికూడ సద్వినియోగం కాకపోవడం శోచనీయము.

కళలయొక్క ముఖ్యోద్దేశము మానవునకు యిహపరాలలో రక్తిని, ముక్తిని సమకూర్చడం. కళాకారులు. ఆరాధకులు ఆ యుద్దేశానుగుణంగా చిత్తశుద్ధితో వ్యవహరిస్తే కళలు నిరంతరము ఉత్తమ స్థాయిలోనే యుండును. ఈ నాడు పురుషులు మాత్రము నృత్యకళను దేవాలయాలలో దేవుని ఎదుట ప్రదర్శించుట కవకాశము, స్త్రీలకా అవకాశము లేకపోవలసిన అగత్యముండదు. కళాకారులు, ఆరాధకులు కళలపవిత్ర ఉద్దేశ లక్ష్యాలకు భిన్నముగా వ్యవహరించినచో కళలు చిత్త సంస్కారమునకు తృప్తికరంగా తోడ్పడజాలవు.

ఇక నాటకరంగమనిచూస్తే. పూర్వములాగ చాలమంది నటీనటులు విద్యాసంస్కారములతో పాత్రౌచిత్యమును గుర్తించి నటించువారు అరుదైపోయారు. ఈ నాటి నాటకాల సాహిత్యం పేలవంకావడంతో నటీనటుల భావయుక్తమైన నటనాస్థాయి సయితము సన్నగిల్లి మునుపటి నాటక ప్రదర్శనములందలి రసజ్ఞత లోపించినదనే చెప్పాలి. అయితే యీ నాటి నాటకాలు వినోద ఉల్లాసాలను, విజ్ఞానాన్ని సమ

కూర్చడంలేదాయంటే, లేదనిచెప్పలేము. కాని కళయొక్క ఉద్దేశాన్ని విస్మరించకుండా ఉత్తమస్థాయిపట్ల కవులు, నటీనటులుకూడ ఆసక్తిచూపాలి. తాత్కాలిక ఆనంద ఉల్లాసాలనో, ఉద్రేకాన్నో, ఉత్సాహాన్నో పురికొల్పడానికని కొన్ని నాటకాలు వాడుకభాషలో వ్రాయబడి, ప్రదర్శించబడుచున్నా, తృప్తిగా చిత్త సంస్కారానికి తోడ్పడగల ఉత్తమ నాటకాలు ప్రదర్శించబడుతుండాలి; యింకా అనేక ఉత్తమ నాటకాల్ను ముందు ముందు రచింపబడాలి. దానిని ప్రజలు, ప్రభుత్వముకూడ ప్రోత్సహించాల్సి!



# గోక్షీర వృద్ధికి

నల్లేరుచిగుళ్లు, జీలకర్ర యీ రెండు వస్తువులను ఒక్కొక్కటి అరతులమంతున గైకొని మజ్జిగతో నూరి రోజుకొకసారిగా నాలుగుదినములు యిచ్చిన ఆవులు, గేదెలు వీటికి పాలు ఎక్కువగును. పశువులు వీటిని తీసుకొనకున్న, యీ ఔషధమును దూడల శరీరంపై పూసిన ఆ దూడలను పశువులు నాకుటచే ఔషధము లోనికిపోవును.

ప్రకాశచంద్ర శతపథి



శ్రీ సాయి సమాధి దినోత్సవంనాడు స్వామి కేశవయ్యాజీ విభూది ప్రసాదమును భక్తులకు పంచిపెడుతున్న దృశ్యము

# సాయినిలయంలో మహా సమాధి దినోత్సవం

—X—

మద్రాసు-మైలాపూర్ నగరంలో శ్రీ సాయిబాబా మహాసమాధి దినోత్సవము అక్టోబరు 23వ తేదీన సాయినిలయంలో అవరణలో స్వతంత్రముగా సమర్పిన పండిట్, మద్రాసు హైకోర్టు జడ్జి శ్రీ వి. సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతన వైభవముగా జరిగెను. నగరంలో అనేక ప్రదేశములలో వర్షము నా అరోజున ప్రత్యేకంగా త్యాగరాయనగర్ ప్రాంతమున వర్షము లేకపోవుట విశేషమని పేర్కొనవలసియున్నది. 22వ తేదీన షుమారు రెండు వేలమంది బీదలకు అన్న ప్రదానము జరిగెను.

స్వామి కేశవయ్యజీ మహాసమాధి దినోత్సవ బహిరంగ సమావేశములో పాల్గొనగ అశేష భక్తకోటికి స్వాగతము చెప్పుచు ఆ సందర్భమున వర్షము లేకుండినందుకు సాయిభగవాన్ కరుణాకటాక్షములు కారణమని, ఉత్సవము జయప్రదముగా జరుగుటకు తోడ్పడిన సేవా తత్పరులకు, భక్తులకు కృతజ్ఞతను వెలిబుచ్చిరి.

దివాన్ బహదూరు కె. యస్. రామస్వామి శాస్త్రి గారు ఉపన్యసిస్తూ శ్రీ సాయిబాబా మహిమను, ఆయన మానవోద్ధరణకు చేసిన సేవను వివరించి, శ్రీ బాబా మన దేశపు దివ్యపురుషుల కోవలోనివారని, సంవత్సర సంవత్సరం భక్తులసంఖ్య అధికమగుచున్నందులకు సంతోషమును వెలిబుచ్చి, స్వార్థరహితంగా స్వామి కేశవయ్యజీ నిరాడంబరముగా, నిర్విరామంగా కొనసాగిస్తున్న భగవత్సేవ, మానవ సేవా కార్యక్రమాలకు జోహారు లర్పించారు.

శ్రీ టి. పురుషోత్తం యం. యల్. సి. గారు మాట్లాడుతూ సత్యసమ్మతమైన చిత్తశుద్ధితో భక్తి వలన మనకు సాధింప శక్యము కానిదంటూ లేదని వివరించుచు ఆనాడు వర్షమువల్ల భక్తులకు యిబ్బంది ఏర్పడకపోవునట్లుగా తలస్థించుటకు భక్తుల భక్తి విశ్వాసములే కారణమయియుండాలని చెప్పిరి.

శ్రీ సాయిబాబా కరుణాకటాక్షములను గురించి, భక్తుడుగా తన అనుభవాలను వివరిస్తూ ప్రతి గురువారము వేలసంఖ్యలో స్వామి కేశవయ్యజీ ద్వారా శ్రీ సాయిబాబా అనుగ్రహ కటాక్షములను, ఆశీస్సుల నర్థించి గుమికూడు భక్తులకు విసుగు విరామమెరుగక సేవచేయుచున్న స్వామిజీని ప్రశంసించారు. భక్తిముక్తి మార్గాలను ప్రబోధిస్తూ సుఖసౌభాగ్యాలను సమకూర్చుచున్నందుకు భక్తకోటి కృతజ్ఞులన్నారు. మానవ జీవయాత్ర మంచి చెడ్డల మిశ్రమముగాన స్వామీజీ సేవా కార్యక్రమాలలో కొన్ని అవాంతరములు అవరపరిస్థితు లేర్పడుటలో విశేషము లేదనియు, వానిని లక్ష్యము చేయక నిరాటంకముగా ఆయన తన కార్యక్రమములను నిర్వహించవలెననీ, అధికార వర్గమువారు తమ సహాయ సహకారములతో యిట్టి సేవా కార్యక్రమాలను, సంస్థలను ప్రజాశ్రేయో సౌభాగ్యముల నుద్దేశించి, ప్రోత్సహించి నిర్వహణకు తోడ్పడవలసియున్నదనిరి.

శ్రీ చిత్తూరు వి. నాగయ్యగారు ఉపన్యసిస్తూ తమకు స్వామి కేశవయ్యజీని చాలకాలమునుండి తెలియుననియు, తాను స్వయంగా గురువారంనాడు సాయినిలయంలో పాల్గొనలేకపోయినప్పటికి, ప్రతి గురువారం తమ యింటిలో శ్రీ సాయిబాబా నారాధించుచున్నాననియు, బీదసాదలతో సహా గుమికూడియున్న అశేష భక్తబృందము తన్ను సంభ్రమాశ్చర్యములతో నింపినదని అనిరి. రామనామస్మరణతో గాంధీజీ మనకు స్వాతంత్ర్యమును సమకూర్చగా శ్రీ సాయి నామస్మరణ మనకు సుఖసౌభాగ్యములను సమకూర్చుచున్నదనిరి.

స్వీయయిబ్బందులకు సయితం అధిగమించి ప్రతిఫలాపేక్షారహితంగాను, స్వార్థరహితంగాను పారమార్థిక, పరోపకారచింతలతో స్వామీజీ చేయుచున్న అమూల్యమైనసేవన్నారు.

మద్రాస్ కార్పొరేషన్ డిప్యూటీ కమీషనర్ శ్రీ యస్. శంకరన్ మాట్లాడుతూ కొందరు, నాస్తికత్వాన్ని ప్రబోధించేవారున్నా తమిళనాడులోని అధికసంఖ్యాకులు భక్తిపరులనియు, వారికి నాస్తికత్వము అబ్బదనియు, వాస్తవమైన భక్తివిశ్వాసముల

# రాజకుమారి

ఫ్రెంచి మూలం : అంటోని డె సయంట్-ఎక్స్యూపెరీ

తెలుగు అనువాదం : డాక్టర్ వి. ఎస్. శర్మ



(గతసంచిక తరువాయి)

## అబ్బాయి చిత్రిస్తూవున్న దివ్యలోకం!

ఏం అంతకన్నా వివరంగా మరేం జవాబు ఇస్తానోనని నా కేసి చూడసాగాడు. ఏం చెప్పాలి? చేతిలోవున్న పని తెమలక సతమతమై పోతూవున్నాను.

"ఏం మాటావు? పూలు ...."

"అదంతా ఎందుకువచ్చింది ఇప్పుడు? ఈ పని తెమలలేక సతమతమైపోతున్నాను. ఇదెంతో అవసరమైన పని. ముఖ్యమైన పని. దీన్ని చూసుకున్నాక ...." అని నా పని గొడవె అబ్బాయికి చెప్పాలని, దాంతో వాడు తృప్తిపడి, కొంతసేపు ఓపికపట్టి వుండగలుగుతాడని అనుకున్నాను. కాని వాడికి అంత ఓపిక అనేది వుంటేనా?

"నాకు జవాబు ఇవ్వటమూ ముఖ్యం కాదా?" అని మరో సూటిప్రశ్నను నా మీదికే విసిరేశాడు అబ్బాయి.

అంతటితో వూరక వుంటాడా? "నువ్వూ పెద్దవాళ్ళకిమల్లె జవాబిస్తే సరిపోతుందా మరి?" బిక్కమొహం పెట్టుకొని అన్నాడు. వాడు అలా అంటుంటే ఇంక నేనేం అనగలుగుతాను?

దీంతో వాడి బుర్రలో ఎన్నెన్నో ఆలోచనలు రేకెత్తి పోతున్నాయి. దాంతో వాడి వుద్రేకాన్ని, ఆవేశాన్ని కళ్లారచూసి తీరాలి! ... కళ్ళని పెద్దవి చేసుకున్నాడు. గాలిలో వెంట్రుకలు ఇటూ అటూ కదలుతూవున్నాయి. చేతుల్ని తిప్పుతూ అబ్బాయి ఇలా అన్నాడు.

"నాకు తెలిసిన మరో గ్రహమండలం వుంది. దాన్లో వుండే ఆయన కోడిపుంజుకి మల్లె అట్టహాసంగా వుండే మనిషి. ఏకోశాన పూలవాసన అంటే ఏమిటో తెలియని మనిషి ఆ గ్రహంలో నివసించే ఆయన. అంతదూరమెందుకు? నక్షత్రంకేసి చూసిన వాడుకాదు ఆ పెద్దమనిషి. ఎవళ్లనీ ప్రేమించినవాడు కూడాకాదు. ఆయనకు వున్న గొడవ ఒక్కటే! తనే గొప్పమనిషి. అంత గొప్పమనుషులు ఈ లోకంలో, ఆ లోకంలో మరేలోకంలో కలికానికైనా లేరనే గర్వం చెప్పరానంత వుంది...అటువంటి వాళ్లని మనుషులు అనటానికన్నా స్పంజి అనటమే మంచిది."

"అంటే?" అని అడిగాను.

"అంటే సముద్రపు స్పంజి అన్న

మాట!'' తీక్షణంగా నాకేసి చూస్తూ అన్నాడు. తేలా వాడిమాటకు అడ్డురావటం అబ్బాయికి ఏ మాత్రం ఇష్టంగా వున్నట్లు లేదు.

''పూలకు ముళ్లు వుండటం ఇప్పటి కాదు. వేలవేల సంవత్సరాలనుంచి ఇలా జరుగుతూనే వుంది. అలా వాటికి ముళ్లు వున్నా, తరతరాలనుంచి ఆ ముళ్లతో నిండి వున్న పూలనే తినివేతిర తినటం మేకలకు పరిపాటి అయిపోయేవుంది. ఇదంతా సృష్టి మర్మం. ఆ సంగతే తెలపమని నిన్ను అడగటం! కాని నీకు ఇదంతా అంత ముఖ్యమైన సంగతి అని కనబడటం లేదు. అంచేతనే నీ యీ జవాబు వింటుంటే ఆ గ్రహమండలపు మనిషి జ్ఞప్తికి వస్తూ వున్నాడు... అలాటి జవాబులతో తృప్తి పడుతాననుకున్నావా? అన్నిటి అంతూ పంతూ పూర్తిగా తెలుసుకోకపోతే ఎలా వుండగలుగుతాననుకుంటావు? ఇదంతా అంత ముఖ్యంకాదని నువ్వు అనుకుంటావు! నీకు కాకపోతే అందరికి అలాగే వుంటుందా చెప్పు?''

ఆ మాటలు అంటూవుంటే, వాడిలో పైకి వుబికి వస్తూవున్న ఆవేశాన్ని కళ్లార చూసి తీరాలి. ఆ వుద్రేకంలో ఎన్నెన్నో కొత్త సంగతులు, ఈ జన్మలో నేను ఎప్పుడూ వినని సంగతులను చెప్పటానికి ప్రారంభించాడు.

''ఎవళ్లయినా ఒక్క పువ్వును కళ్ళార చూసి ఆనందించారంటే దాని రూపలావణ్యాన్ని కలలోనైనా మరచిపోగలుగుతారా? అది ఆ మనిషికి అన్నివిధాలా నచ్చిన పువ్వు. దానిని మనం ఎక్కడ దాచివుంచినా, అది వాడికళ్లబడిందా, తనది అని దానిని గుర్తుపట్టటానికి, దాన్ని చూస్తూ మైమరచిపోవటానికి ఏమాత్రమూ కష్టం వుండదు. అలాగే ఒక మేకకు, దానికి నచ్చిన పువ్వు కంటపడిందా, ఎంత తల్లక్రిందులయితేనేం, దాన్ని తినకుండా ఎలా వుండగలుగుతుంది? కాని ఇలాటివి నీకు అంత ముఖ్యమైనవి కాదని అనుకుంటావు!'' పట్టుదల అంటే అబ్బాయిదే! విధి విరామంలేకుండా అస్తమానమూ అలాటి కబుర్లతోనే కాలక్షేపం చేయటం వాడి అణువులోనే వున్నదని చెప్పవచ్చు. ప్రొద్దున ప్రారంభించిన ఈ కాలక్షేపం చీకటిపడ్డా అంత సులభంగా ముగిసేటట్లూ వుంటేగా!...

అలసి సొలసి పోయాడు మాఅబ్బాయి-మా రాజకుమార్. చీకటి పడుతూవుంది. వాడికి ఇదంతా తేటతెల్లం కాకపోతే, ఎందుకలా ఆవలిస్తూ వుంటాడు? అలా వున్నా తన కబుర్లని ఆపే ఘటమైతేగా!

చావు బ్రతుకుల మధ్య సతమతమై పోతూవున్నాను. ఆకలి! భరింపరానంత ఆకలి! దాంతో దాహం! చెప్పరానంత

శాపాం! వీటినుంచి బయటపడటం ఎలా? ఇంజన్ బాగుపడితేనే? ఆ గొడవను ఈ రాత్రిపూట చూసుకోటానికి ఎలా వీలు కుదుర్తుంది! ఎటుచూసినా ఎడారి! దరీ దాపూ లేని ఎడారి! అబ్బాయి అలా మరో లోకాన్నుంచి అలా వూడిపడి నా దగ్గర వుండకపోతే ఈ అయిదు రోజుల్లో నా దుర్భరావస్థ ఎలావుండి వుండేదో! ....

చేస్తూవున్న పనంతా ఆ పళాన ఆపేసి, ఆబ్బాయిని ఒళ్లోకి తీసుకుని గట్టిగా హత్తుకున్నాను .... "పువ్వు కదూ నీకు బాగా నచ్చింది. అదేగా నీ మేకకు తినటానికి కావలసింది. అదంత కష్టమైన పనికాదు, రాజకుమార్! అలాటి పువ్వునే తీసి నీకు ఇస్తాను. నిమేక దగ్గరే దాన్ని భద్రంగా వుంచుకోటానికి, పరాయివాళ్లు దాన్ని తీసుకొని వెళ్లకుండా వుండటానికిగాను దాని చుట్టూ కంచెను కట్టి ఇస్తానులే...ఇంకా నీకు .." అబ్బాయిని నిద్ర బుస్తూ, వాడి చెవిలో ఏమేమో వూదుతూ వున్నాను నా వుద్రేకంలో! అలా వాడి చెవిలో వూదవచ్చా? ....

అదోలోకం! అబ్బాయి నిద్రపోతున్నాడు. ఆ నిద్రలో కమ్మని కలలని కంటూవున్నాడు. ఎందుకు చెప్పమా అలా కన్నీరు కారుతూవుంది? ఆ కమ్మని కలల మధ్య వాడిని బాధించే కలలు కూడా వస్తూవున్నాయి కాబోలు! ఒళ్లో అలా వుండిపోయిన అబ్బాయిని చూస్తూవుంటుంటే ఇక ఆకలి దప్పులు అనేవి ఎలావుంటాయి? చావు బ్రతుకులమధ్య వుక్కిరి బిక్కిరి అవుతున్నానని అనుకోటం ఎందుకు? వున్న చోటున అలాటి మధురానుభూతులని ఆస్వాదిస్తూవున్న పరిస్థితుల్లో ఎడారి అని ఎలా అనగలుగుతాను? నా భవిష్యత్తు ఏ రూపాన వుండబోతుందో? ఆ గొడవను ఆలోచించటమా ఇలాటి దివ్యలోకపు వాతావరణాన్ని అనుభవిస్తూవుంటే?...



# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రాధాకృష్ణయ్య



(గత సంచిక తరువాయి)

శిష్యుని ప్రశ్న వ్యక్త ఆత్మను గురించి, "మనసును వ్యవహరింపజేయుశక్తి ఏది ?" గురువు యొక్క ఉత్తరము ప్రశ్నకుమించి యున్నది. ఏలన శిష్యుని యోగ్యత గురువుకు తెలియును. శిష్యుని ప్రశ్న వ్యక్త బ్రహ్మమును గురించి యుండినను, శిష్యుడు మోక్షార్థి గనుక, ఆత్మజ్ఞానము తెలుపనిది అతనికి నిరతిశయానందము కలుగదు అని తెలుసును.

శిష్యుని ప్రశ్నయొక్క భావము అవ్యక్త బ్రహ్మ స్వరూపమును తెలియుటకై యున్నది. కన్నుకు చూచు శక్తినొసగునది ఆ జీవకేంద్రము, కేంద్రములకు కేంద్రము — నిత్యానందపరబ్రహ్మము!

ఒక గ్రామవాసి, నగరమును చూచుటకు వెళ్ళినచో ఎలక్ట్రిక్ బల్బు ఎట్లు వెలుగును అని ఆశ్చర్యపడును. అతని స్నేహితుడు దయగలవాడైనచో, కరెంటు ఉత్పత్తి స్థానమునుండి కమ్ములద్వారా నగరమంతయు వ్యాపించి ఆ బల్బు నందలి తీగ ప్రకాశించువరకు విశదీకరించి చెప్పును. అదేవిధముగ, శిష్యుని ప్రశ్న, ప్రత్యక్ష వ్యక్త పరమాత్మ స్వరూపమునుగురించి విచారించుచుండినను, ఆ ప్రశ్నయందలి భావము శుద్ధ ఆత్మను తెలుసుకొనుటకని తెలుసుకొని మిక్కిలి కనికరముతో. "నేను నీ ప్రశ్నకు తగు ఉత్తరము తెలిసియున్నానని సంతసించినచో, నీవు పొరబడుచున్నావు. నేను ఇంకను విశదీకరించి యుండలేదు." అని గురువు తెలుపుచున్నాడు.

గ్రామవాసునికి, బల్బులోని వెల్తురు, పంకాలోని గాలి మొదలగువాటిని విమర్శించి, మరల వీటిమూలాధారముగ తంతులలోనుండు కరెంటును పరిచయము కలిగించవలెను. అదేవిధముగ, చైతన్యమొసగు "కన్నుకు కన్ను, చెవికి చెవి" అని తెలుపుటతో అదియే ఆత్మ అని తలచిన పొరబాటగుచున్నది. వ్యక్తస్వరూప ఆత్మకు అతీతముగ, దానివలన ఎట్టిపరిణామము చెందక సత్యపరమాత్మ యున్నాడు. పరిణామము మారుచుండును. కన్ను, ముక్కు, చెవి, మనసు, బుద్ధి, అను పరిణామములు. నీటిని తెచ్చుటకు లోటా అనివార్యమగు గున్నట్లు, చైతన్య ప్రకాశమునకు అనివార్యకరణ మూలంగా నున్నవి.

పరిణామములవల్ల చైతన్యకేంద్రముయొక్క జ్ఞానము మనకు కలుగుచున్నది. మొదలు వీటియందలి ప్రకాశములవల్ల తెలుసుకొనుచున్నాము. పిమ్మట బాహ్య ప్రకారముల యవసరము లేకనే గమ్యస్థానమును చేరి అనుభవించగలము.

"బాగుగ తెలుసుకొనగలిగితినని నీవు తలచిన, నిజముగ నీకు తెలిసినది అతిస్వల్పము" అను హెచ్చరిక చూచుచున్నాము. ఎందుకనగా, మనలో ఎవరుగాని, మన గురువులుగాని ఆత్మను నేను తెలుసుకొంటిమి అని చెప్పలేము. ఆత్మ తెలుసుకొనబడువస్తువు కాదు. తెలుసుకొను తెలివి, బ్రహ్మమును, వస్తువు రూపమున చూడలేము. వినలేము. తెలుసుకొనలేము. నేను ఈ గడియారమును చూచుచున్నాను - మీరు చూచుచున్నారు. దీనికొక రూపమున్నది. ఆ రూపము మీకు, నాకు, భిన్నముగా నున్నది. తీరుబాటు కలిగినచో మీరు, మీ వ్రేళ్ళను చూడవచ్చును. వాటి సౌందర్యమును మెచ్చుకొనవచ్చును. ఎందుకు అది మీ చూచుకరణమగు కంటికి భిన్నముగానున్నది. కాని మీ కంటిని మీరు చూడజాలరు. అదేవిధముగ, ఆత్మ చూచుచున్నది, తెలుసుకొనుచున్నది, గ్రహించుచున్నది. కాని చూడబడదు. తెలుసుకొనబడదు, గ్రహింపబడదు!

అందువలన మనకు గల మార్గము ఏమికలదు? అహంకారమును తొలగించినచో "నేను" అనుటకు ఆస్పదముండదు. ఆత్మమాత్రము చైతన్య అపరోక్షానుభవముగ మిగిలియుండును. సాధన పూర్తియగు సమయమున "నేను" అనునదియుండదు. కనుక నిరాశజెందనవసరములేదు. మనము ఆత్మస్వరూపులగుచున్నాము!

ఒక వ్యక్తి నదిలో స్నానం చేయుచుండెను. బంగారు నగ ఒకటి జారిపోయింది. దిగులుతో చాలా కష్టపడి వెతికినాడు. నీళ్ళలో మునిగి అగచాట్లు పడి దానిని చూడగలిగినాడు. అతని ఆనందమునకు మేర లేదు. కాని నీటి అడుగునయుండి తన సంతోషమును బైటయుండువారికి మాటలతో తెలియజేయజాలడు. అక్కడ వాక్కు అణగిపోయివున్నది. కనుక తక్కాలమున తన ఆనందమును ప్రకటింపజాలడు. అదేవిధముగ ఆత్మానుభవ కాలమున విమర్శలకు అవకాశములేదు. ఆ భావమును తలచుకొని ధ్యానించవచ్చును. అట్టి ఆనందానుభవ పదవియందు, నీవు, నేను అను భావములు లేవు. అట్టి అభేదభావము అనుభవ సాధ్యమని వేదాంత పురుషులు నిర్ధారణ చేయుచున్నారు.

ప్రతిదినమును మనము మూఢ అనుభవస్థితులయందు జీవించుచున్నాము. మన జాగ్రతావస్థయందు కనబడునవి స్వప్నమున మిథ్య అగుచున్నది. జాగ్రత్తలో, కడుపునిండుగు భోజనముచేసి పరుండగనే కొన్ని నిమిషములకల్ల స్వప్న ఆకలి కలుగుచున్నది, స్వప్నమున ఆరగించిన విందుభోజనము జాగ్రత్తయందుగల ఆకలిని తీర్చలేకున్నది. ఒక అవస్థయందు సత్యముగనుండునది మరియొక అవస్థయందు మిథ్య అగుచున్నది. సుషుప్తియందు పై రెండవస్థలును లేవు. రెండును మిథ్య అగుచున్నది.

వీటికి అతీతముగ మరియొక అవస్థయున్నది. దానిని తురీయము అంటారు. అదియే ఆత్మ ఎఱుక అనబడును. అట్టి ఆత్మ ఎఱుకగల అవస్థను తురీయము అంటారు. ఉపనిషత్తు ఋషులు, ఈ పరిపూర్ణ పదవియందు, మొదటి మూడవస్థలు దీర్ఘస్వప్నములుగనుంటున్నవి. పరిపూర్ణ ఆనందము, పరిపూర్ణ పదవియగు తురీయావస్థ పొందుటకు సర్వసాధనములు ఉపయోగపడుచున్నవి. ఈ జగత్స్వప్నము సత్యమను భావము మనయందు రూఢి అయివుండుటవల్ల, తురీయావస్థ అనుభవము, దాని దివ్యప్రభావము తెలియలేకున్నాము.

ఉప్పుతో చేసిన బొమ్మను దారమునకు కట్టి సముద్రములో విడిచి, కొంతకాలమైన వెనుక బైటకి లాగినచో, వట్టిదారము వచ్చును. బొమ్మ సముద్రనీటిలో కరగి, సముద్రాకారము చెందుచున్నది. అది సముద్రమునుండి ఉప్పుగా పుట్టినది. ఒక రూపము ధరించినది. మరల తన సహజస్థితిలోకలసి ఆనందమనుభవించుచున్నది. బొమ్మలను అహంకారము ఉప్పులో నామరూపములు పొంది. కొంతకాలముండినది. మరల తన స్వరూపముతో ఏకము కాగా నామరూపములు మిథ్యఅయినవి.

అదేవిధముగ తురీయావస్థయందు మనసులేదు. కనుక విక్షేపములేదు. ఆనందమయముగానుండును.

ఓం అను ప్రతీకము మీద, మన మూడు అవస్థలను ఆరోపించుచున్నాము. అ-ఉ-మ-మూడు శబ్దములు కలసి ఓం అగుచున్నది. అ అనునది జాగ్రతావస్థను తెలుపును. ఉ అనునది స్వప్నావస్థను తెలుపును. మ అనునది సుషుప్తిని తెలుపును. ఈ మకారమును దీర్ఘము చేయుటవల్ల తురీయావస్థను తెలుపుచున్నది. రెండు ఓంకారములకు మధ్యనుండు నిశ్శబ్దసమయము ధ్యానసమాధి స్థితి. దానితో సాధకుని మనను నిర్మలము, నిశ్చలము పొంది ఆనందసాగరమున మునిగి దివ్యపరబ్రహ్మమున లయము చెంది రూపులేక పోవుచున్నది.

ఇట్టి అపరోక్ష అనుభవమువల్ల శుద్ధ ఆత్మజ్ఞానము, వ్యక్తి పరిణామముల సహాయమపేక్షించక, అనుభవించవచ్చును. ఇట్టి అంతర ఆత్మానుభవమువల్ల మానవుడు తన దివ్యపరిశ్రమను ఫలవంతము జేసుకొనుచున్నాడు.

మృత్యోర్మా అమృతం గమయ.

## స్వప్న మరీచికలు

మనయందుండు చైతన్యశక్తిని ఇదివరకు ఒక ప్రకాశమునకు పోల్చి విచారించి యున్నాము. ప్రకాశకిరణములు కొన్ని అద్దమువంటి నునుపగు చీదరమున పడినపుడు ఒక ప్రతిబింబ మేర్పడుచున్నది. జ్ఞానప్రకాశమువల్ల కలుగు ప్రతిబింబమును చిదాభాసమని వేదాంతమున తెలుపబడును. చిత్ అనగా చైతన్య-ప్రకాశము. అభాసమనగా దాని ప్రతిబింబము. సూర్యుడు నీళ్ళలో ప్రతిబింబించినట్లు, ఆత్మసత్యకిరణములు మనసునపడినపుడు చిదాభాసుడను ప్రతిబింబము కలుగును. ఈ చిదాభాసుడు మానసిక రంగమున కృత్రిమ నాట్యమాడుచు అహంకారమను భూతమగుచున్నాడు. ఈ అహంకారమును నాశముచేయుటవల్ల ఆత్మానుభవము కలుగునని వేదాంతము నిరంతర శాంతప్రచారము చేయుచున్నది. ఇట్లు శ్రుతినమ్మకము తెలుపుటవలన, అహంకార స్వరూపవిచారమువలన మన పరమార్థయాత్ర సులువుగా జరుగగలదు.

జ్ఞానజ్యోతియగు పరమాత్మ, ఆత్మచైతన్యము, మానవుని కేంద్రములకు కేంద్రమగు హృదయగృహయందు నిరంతరము ప్రకాశించుచున్నది. మన బుద్ధియందు ఆ కిరణములు పడి ప్రతిబింబించును. ఇంద్రియ విషయానుభవ ఆశలతో మనము జీవించుచుండుటవలన మన బుద్ధి పూర్తిప్రజ్ఞ, బాహ్యముఖముకలిగి యున్నది. అందువలన ఆత్మకిరణములు ఆత్మకు సమీపమున ప్రతిబింబించుచున్నవి.

పసిబిడ్డ తన నీడనుచూచి భయపడునట్లు, మనము ఈ ప్రతిబింబించు కిరణములను చూచి ఇదియే ఆత్మ అని భ్రమించుచున్నాము. ప్రతిబింబము ప్రతిఫలించు చదరముయొక్క గుణము స్వభావమునుబట్టి వ్యతిరేకించుచుండును. మనోబుద్ధులలో వ్యాకులత కలిగినపుడు ఈ చిదాభాసుడు పిచ్చివానివలె, బెదిరి నాట్యమాడుచుండును. కామ క్రోధ మోహావేశములు కలిగినపుడు బుద్ధి మందగిలి చిదాభాసుని కూడ ఆవరించుచున్నది. ఇట్లు సామాన్యముగ పరమసాధువుగనుండు మనిషికూడ మోహావేశములవల్ల మృగప్రాయుడగుచున్నాడు. ప్రతి రామునిలో రావణు డపుడపుడు కనబడుచున్నాడు.

మర్త్య కోరికలయందు బుద్ధి పరుగిడునంతవరకు, మన అహంకార భ్రమలుతొలగవు. ద్వైతభావము పోదు. ద్వైతభావమువల్ల దుఃఖరాసులు మనలను బంధించుచున్నవి. ముముక్షువుల ప్రయత్నమంతయు పరిమితులను అతిక్రమించి, శాశ్వత శాంత పదివిని కోరుటయందుండవలెను. సాధకుని ప్రయత్నము, దుఃఖనివృత్తి సుఖప్రాప్తికొరకు యుండవలెను.

వేదాంతమున తెలుపబడు బ్రహ్మవిద్య ఇట్టి నామరూపములు కనుబరచు ఆందోళనము తొలగుటకు తగు ఉపాయము తెలుపుచున్నది. ఇందు మనోబుద్ధులను సంస్కరించుట తొలిశిక్షణగానున్నది. బాహ్యదృష్టియే అహంకారభావమునకు మూలము. అహంకారము తొలగిన పరిపూర్ణత. చేకూరుచున్నది. ఆత్మసంస్కారమువలన జ్ఞానేంద్రియములు వశపడిన పుణ్యపురుషులు దీర్ఘధ్యానమువల్ల అంతరముఖులగుచున్నారు. చిరకాల నిరంతర వేదాంత సాధనవల్ల బుద్ధికిగల బాహ్యదృష్టి తొలగుచున్నది.

ఆత్మకిరణములు బుద్ధియందు ప్రతిబింబించి బాహ్యమున చిదాభాసుడు, లేక అహంకార మనబడుచున్నది. సాధనవల్ల, ఆత్మసంస్కార ఫలితముగ సాధకుడు అంతర్ముఖముపొందు కొలది, ఈ కిరణములు వెలుపలపోక, ఆత్మవైపు సమీపించును. తుదకు ఆత్మతో ఏకమైపోవును. అప్పుడు అహంకారము పూర్తి లయమగుచున్నది. అట్టి అనుభవము మన స్వస్వరూపము. లేక ఆత్మపదవి ఇదియే జీవిత పరమపదము. జీవితఫలము.

శాశ్వత నైజమగు ఇట్టి పదమానుభవము విషయజ్ఞానమువంటిదికాదు. అది సన్నిహిత అపరోక్షానుభవము. అందువల్ల ఇట్టి తీవ్రఅనుభవమును మాటలతో తెలుప సాధ్యములేదు. మన తల్లికిగాని, సోదరికిగాని పుత్రునికిగాని మనయందుగల ప్రేమను మాటలతో మనము తెలుపజాలము. లడ్డుయందుగల రుచిని తినుట

వల్లనే తెలుపగలము. అందువలన శిష్యుని వాక్యములు ముందు మంత్రమున గమనించవలసియున్నవి.

నాహం మన్యే సువేదేతి నో న వేదేతి
వేదచ
యో నస్తద్వేద తద్వేద నో న వేదేతి
వేదచ ॥ 2

నాకు బాగుగ బోధపడినదని తలచజాలను: నాకు పూర్తి తెలియకపోలేదు. నాకు కొంచెము తెలిసింది. ఎవరు బోధపడలేదని, తెలిసినదని తెలుసుకొను చున్నాడో అతనికి దానివిషయము బాగుగా తెలియును.

సామాన్య విషయజ్ఞానమువలె పరోక్షముగ ఆత్మను తెలియజాలము. ఇది గురువుయొక్క హెచ్చరిక. సర్వవిషయజ్ఞానములు. మనోబుద్ధుల వ్యవహారముల వల్ల తెలియుచున్నది. జ్ఞానచక్షువువలన కలుగు ఆత్మానుభవములు అటువంటిదికాదు. దీనికి తగు సమాధానమును శిష్యునిపై మంత్రభావము తెలుపు చున్నది.

శిష్యుడు, ఆత్మానుభవము. మేజా కుర్చీల జ్ఞానము కలుగునటువంటిదిగ కాదని అంగీకరించుచున్నాడు. పరోక్షముగ నుండు విషయముయొక్క జ్ఞానము మనము బాగుగ తెలుసుకొనవచ్చును. లేక కొద్దిగ తెలుసు కొనవచ్చును. కాని ఆత్మజ్ఞాన మట్టిదికాదు. నీ భార్యా బిడ్డలను నీవు తెలుసుకొనుటకన్న, నిన్ను నీవు బాగుగ తెలుసుకొనుచున్నావు. ప్రపంచమున గల ఏ ఇతరవిషయమునకన్న నాసంగతి నాకు బాగుగ తెలియును. విషయజ్ఞానముకన్న ఆత్మజ్ఞానము కోటి రెట్లు అధిక వ్యక్తిగత అనుభవముగ నున్నది. కనుక ఈ ఆత్మ ఎఱుకను మాటలతో తెలుప సాధ్యము లేదు.

ఒక నిర్దిష్ట అనుభవమును మాటలవల్ల తెలుప సాధ్యమగుచున్నది. తెలుపసాధ్యము కాని విషయ ములను భాష తెలుపజాలదు. ఆత్మానుభవము మనసున కలుగు వ్యవహారము కాదు. అది శుద్ధ ఆత్మజ్ఞాన ఎఱుక సాధకుడు యోగసాధనవల్ల మనస్సును లయింప జేయుటవల్ల కలుగుచున్నది. కనుక అది మనస్సుకు అతీతము. భాష మనోబుద్ధుల వ్యవహారములను మాత్రము తెలుపగలదు.

ఒక అనుభవము తీక్ష్ణసుగు కొలది, భాష సూక్ష్మ మగుచున్నది. వాక్యములు తొట్రుపడుచున్నవి. అందు వలన ఈ మంత్రమునందు పరస్పర విరుద్ధముగ తోచు రెండు భావములు ఏకైక అనుభవమును తెలుపు చున్నవి. శిష్యుడు తన సూక్ష్మ ఆత్మానుభవమును వ్యావహారిక అనుభవములతో విమర్శించి, "నాకు బాగుగా తెలియునని నేను తలచజాలను" అను చున్నాడు. అతని సత్యానుభవము పరిపూర్ణమయినను, మేజా, కుర్చీ మొదలగు విషయజ్ఞానములగునట్లు కన బడుటలేదు. ప్రాపంచిక విషయజ్ఞానములు, జ్ఞానేంద్రి యముల ద్వారా, మానసిక ప్రతిఘాతముల తారతమ్య మునుబట్టి విలువపొందుచున్నవి. ఇచ్చట శిష్యుడు సన్నిహిత ఆత్మానుభవము పొందియున్నాడు. అయినను అది విషయానుభవమువలె లేదు. ఆత్మ తన నిజస్వరూపానుభవముగనే అందరు అనుభవించగలరు. అది మహాత్ములందరు తీర్మానించియున్నారు.

శిష్యుని ఆత్మానుభవము క్రొత్తగా యుండినను, అని అతని మానసిక రంగమున విపరీతమని తోచు చున్నది. తాను జ్ఞానస్వరూపుడని తెలుసుకొని యున్నాడు. అయినను, అతని అనుభవము, తన్ను తాను తెలుసుకొనుచున్నాడు కాని, తాను దేనిని తెలుసుకొనుట లేదు. అనగా ఇతరములను గ్రహించుట కాదు. జ్ఞానస్వరూపమగుటగా యున్నది.

ఈ భావము పాశ్చాత్య మత విమర్శకులకు కడు వింతగానున్నది. సాధకుని మానసిక సమస్య వారికి గోచరమగుటలేదు. అట్టి దయారహిత విమర్శకులకు ఈ మంత్రములు కేవల పిచ్చిమాటలుగ నుండగలవు. మరియు నవీన విద్యావంతుడగు హిందువునకు కూడ ఇవి పిచ్చిమాటలుగ నున్నవి.

శిష్యునకు తన ఆత్మానుభవము క్రొత్తగ, వింతగా అసదృశముగ నున్నది. అయినను, దాని యందట్టి అనుమానము అతనికిలేదు. ఆ అనుభవము అతిసన్ని హితముగ నున్నది.

(సశేషము)

# వారఫలాలు

శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి



ఆ నాడు ఆదివారం. సరిగ్గా సాయంత్రం నాలుగున్నరయింది. మందుల కొట్టు కొండర్రావుకి ఏమీతోచక కాఫీ త్రాగుదామని స్వతంత్రా కేఫ్‌కు బయల్దేరాడు. కాఫీ త్రాగుతూ దీర్ఘంగా దేన్ని గురించో ఆలోచిస్తున్నాడు. టేబుల్ మీదున్న ఆంధ్రప్రభను తీసి పేజీలు తిరగేస్తున్నాడు.

రష్యావారి కృత్రిమ ఉపగ్రహం, కాశ్మీరులో కల్లోలం, అల్జీరియాలో హత్యాకాండ, – యింకా ఎన్నో వేడి వేడి వార్తలతో పత్రిక నిండిఉంది. కొండర్రావు విసుక్కున్నాడు. తనకు పనికివచ్చే వార్తలేమీ లేవు. తనకు ఉద్యోగం యివ్వగలిగే ప్రకటన ఒక్కటీ పత్రికలో లేదు. అందుకనే స్వతంత్రంగా మందులషాపు పెట్టుకొని ఏవో నాలుగు డబ్బులు సంపాదించుకుంటున్నాడు. కొండర్రావు దృష్టి వారఫలాలవైపు కేంద్రీకరించింది. నడుస్తున్న వారానికి తన యోగం ఎలా ఉందో చూసుకున్నాడు.

"ఈ వారం శ్రమ ఎక్కువ. మనశ్శాంతి ఉండదు. లాభం, గౌరవం పెరుగుతవి. మీ శక్తులు పరీక్షించడానికా అన్నట్లు కొన్ని కొన్ని చిక్కు ఘట్టాలు ఎదురౌతవి. ఒక బ్రహ్మాండమైన గండం దాటితే గొప్ప లాభం విస్సందేహంగా చేతికి అందేటట్లు కనబడుతుంది. ప్రయత్నం పరిపక్వమైతే మీకు సర్వదా సౌఖ్యం సిద్ధిస్తుంది. వారాంతంలో స్త్రీ సౌఖ్యం. దేహం విషయంలో తగినంత శ్రద్ధగా ఉండడం అవసరం."

కొండర్రావుకి వారఫలాల యందు నమ్మకం లేకపోలేదు. ప్రతీవారం వారఫలాల్ని చూస్తూనే ఉంటాడు. ఏవో కొన్ని కొన్ని జరుగుతూ ఉంటాయి. జరిగినప్పుడు వాటిని గురించి మెచ్చుకుంటూ ఉంటాడు. లేనప్పుడు కిక్కురుమనకుండా ఊరుకుంటాడు. ఈ వారంలో ఫలితాలు ఎలా ఉన్నా, క్రొత్తగా ఓ విషయం తనను ఆశ్చర్యపరచింది. వారాంతంలో తనకు స్త్రీ సౌఖ్యం ఉండట. అవివాహితుడైన తనకు యిదెంతవరకు నిజమౌతుందో చూడాలనుకున్నాడు. ఈ ఆలోచనతోనే యింటికి చేరుకున్నాడు.

ఆదివారం గడిచింది. సోమ, మంగళ, బుధవారాలుకూడా గడిచేయి. కాని ఏ ఒక్క సంఘటనా జరుగలేదు.

ఆ రోజు లక్ష్మీవారం. సాయంత్రం అయిదింటికి కొట్టు కట్టేసి రోడ్డు వెంబడి నడుస్తున్నాడు. మెయిన్‌రోడ్ మలుపు

తిరిగి సందులోనికి సమీపించేడు. చుట్టు ప్రక్కల ఏమంతగా జనం లేరు. ప్రక్క సందులోనుంచి ఓ పడుచుపిల్లవచ్చి రోడ్డు ప్రక్కనే నిలబడింది. తననే చూస్తున్నట్టనిపించింది కొండల్రావుకి. సడన్‌గా ఆగిపోయాడు. వారఫలాలు బుర్రలో మెదుల్తూనే ఉన్నాయి. ఆ అమ్మాయి నిజంగా తనవైపే చూస్తోందా? ఏదో గొప్ప ఛాన్సు తగిలినట్టు ఫీలయ్యాడు. వారఫలాలు ఫలించేయనుకున్నాడు. అమ్మాయికు దగ్గరగా సమీపించేడు. మాట్లాడదామనుకున్నాడు. కాని సాహసించలేకపోయాడు. అమ్మాయినిదాటి ముందుకు నడుస్తూ వెనక్కిచూశేడు. కాని తనను చూస్తూనే చరచర సందులోనికి వెళ్ళిపోయింది. బిక్కముఖం వేశాడు కొండల్రావు. వెంటనే వారఫలాల్లోని విషయాలు జ్ఞాపకంవచ్చేయి. "మీ శక్తులు పరీక్షించడానికా అన్నట్టు కొన్ని కొన్ని చిక్కుఘట్టాలు ఎదురౌతవి. ప్రయత్నం పరిపక్వమైతే మీకు సర్వదా సౌఖ్యం శిద్దిస్తుంది."

కొండల్రావు ముఖంలో చిరునవ్వు చిందింది. వారం గడవడానికి యింకా రెండు రోజులు వ్యవధిఉంది. తన ప్రయత్నం యింకా పరిపక్వం కాలేదనుకున్నాడు. తిన్నగా యింటివైపుకు దారితీశాడు.

శుక్రవారం ఉదయం 8 గంటలు. నీటుగా ముస్తాబై షాపుకు బయల్దేరాడు కొండల్రావు. దారిలో మరో సంఘటన—

ఓ అమ్మాయి తన ముందే నడుస్తోంది. దిక్కులు చూసుకుంటూ నెమ్మదిగా నడుస్తోంది.

తెల్లటి వాయిల్‌చీర కట్టుకుని, ఎర్రటి జార్జెట్టు రవికతొడిగి, మెల్లగ వీస్తున్న మలయమారుతానికి రేగిన ముంగురుల్ని సరిదిద్దుకుంటూ, హంసలా నడిచిపోతున్న ఆ అలివేణి అందచందాలకు ముగ్ధుడైపోయాడు కొండల్రావు. నడకలో స్పీడు హెచ్చించి ఆమెకు దగ్గరగా చేరుకున్నాడు.

"ఏమండీ? ఈశ్వర్రావుగారి యిల్లెక్కడో తెలుసా?" అకస్మాత్తుగా అడిగింది ఆ అమ్మాయి.

నవ్వుతూ అడిగినట్లనిపించింది కొండల్రావుకి. వారఫలాలమాట మర్చిపోలేదు.

"అదిగో ఆ పై సందులో మొదటి యిల్లు" అంటూ అమ్మాయికి దారి చూపించేడు.

"థేంక్స్" అంటూ ఆ యువతి ముందుకు సాగిపోతున్నది.

"ఏ ఊరునుంచి వస్తున్నారు?" తెగించి మరీ అడిగేడు కొండల్రావు.

"రాజమండ్రినుంచి" నెమ్మదిగా ఆమె సమాధాన మిచ్చింది.

"ఈశ్వర్రావుగారు మీకు బంధువులా?" సూటిగా ప్రశ్నించేడు. ఈ ప్రశ్న అడగడం అనవసరం, అప్రస్తుతం అని తనకు తెలుసు. కాని ఏదో రీతిగా సంభాషణలు పెంచాలిగా!

"మాకు కావలసినవారే" అంటూ ఆమె గబగబా నడచిపోతున్నది. రోడ్డంతా జనసంచారం హెచ్చుగా ఉంది. ఇంక కూడా పడ్డం అంత భావ్యంగా ఉండదనుకున్నాడు. వ్యథిత హృదయంతో కొంపకు చేరుకున్నాడు.

శనివారం సాయంత్రం - వారఫలితాలకు చివరిరోజు. కొంచెం టిప్‌టాప్‌గా తయారై ఈశ్వర్రావుగారి వీధమ్మట నడుస్తున్నాడు. ఈశ్వర్రావుగారి మేడ మీద ఓ అమ్మాయి నిలబడింది. ఆ అమ్మాయే తనను నిన్న పలుకరించింది! మేడకు దగ్గరగా చేరుకున్నాడు. మేడ మీది అమ్మాయి తనవంకే చూస్తోంది. తనను తాను మర్చిపోయాడు. ఈ హడావిడిలో చేతిలోని జేబు రుమాలు క్రిందపడిపోయింది.

ఫక్కున నవ్వింది మేడమీది అమ్మాయి.

కొండర్రావు ఆనందానికి అంతులేదు. తాను నవ్వేడు. వారఫలాలు ఫలించేయనుకున్నాడు. జేబు రుమాలు దులువుకొని జేబులో పెట్టుకున్నాడు.

అమ్మాయి నవ్వు ఆగిపోయింది.

ఇంటిప్రక్క నుంచుని దిక్కులుచూస్తూ సన్నగా ఈలవేస్తున్నాడు కొండర్రావు.

అమ్మాయి లోనికి వెళ్లిపోయింది.

ఏమైనా ప్రేమలేఖలు వ్రాయడానికి వెళ్ళిందేమోననుకున్నాడు. అమ్మాయి రాకకోసం ఆత్రుతపడుతున్నాడు.

ఇంతలో వీధితలుపు సడన్‌గా తెరువబడింది. అమ్మాయి దిగివచ్చిందేమోనని ఆశపడ్డాడు. కాని వ్యవహారం ఎదురు తిరిగింది. ఓ ముదుసలి బయటికి వచ్చేడు.

"అదేమిటయ్యా? పైకి చూస్తూ ఈలవేస్తున్నావుట" కళ్లెర్రజేస్తూ మరీ గదిమేడు ఆ వ్యక్తి.

"ఈలవేస్తున్నావట" అని అనడంలోని అంతరార్థాన్ని అవలీలగా అవగాహన చేసుకున్నాడు మందులకొట్టు కొండర్రావు. సమాధానంకోసం తబ్బిబ్బుపడ్డాడు.

"ఏమీ లేదండీ? దారి తెలీక దిక్కులు చూస్తున్నాను" అబద్ధం ఆడక తప్పింది కాదు.

"దిక్కులు చూడకయ్యా! బొప్పులు తగుల్తాయి" అంటూ ఆ వ్యక్తి లోనికి వెళ్ళిపోయాడు.

అనుకున్నది తారుమారైంది కొండ్రావుకి. వారఫలాల్లో చెప్పనే చెప్పేడు దేహం విషయంలో ఈ వారం తగినంత శ్రద్ధగా ఉండడం అవసరం అని. దైవాను గ్రహంవల్ల జాగ్రత్తగానే ఉన్నాడు. లేకపోతే దేహశుద్ధి తప్పక జరిగేదే. ఇంక వారఫలాలగొడవ మర్చిపోయి దిక్కులు చూడకుండా మరీ నడుస్తున్నాడు కొండ్రావు.

—o—

ఒకాయన తనతోబాటు రైలులో ప్రయాణము చేస్తున్న మరొకాయనను "ఏమండీ! యీ రైలు క్రిష్ణానదిబ్రిడ్జిమీదుగా వెళ్ళుతుంది కదండీ" అని అడిగాడు.

"అదేమిటండీ అలా అడుగుతారు! పోయి తీరాలి; లేకపోతే అందులో పడిపోదూ!" అన్నాడు మరొకాయన.

♦ ♦ ♦

"ఏమండీ! నేను కుతుబ్మినార్ దగ్గరకు వెళ్ళాలి ఎక్కడ దిగావో చెప్తారూ!" అని అడిగాడు ఒక బస్సు ప్రయాణికుడు మరొకరిని.

"అలాగే - నేను ఆటే పోవలసియున్నది. నేను ఎక్కడ దిగుతానో చూడండి; దానికి ముందు స్టాప్‌లో దిగాలి మీరు కుతుబ్మినార్ దగ్గర కెళ్ళ డానికి" అన్నాడు

యస్. యమ్. వాడ్రేవు

వంట యింట్లో పిల్లలు లడ్డుండలు తింటుంటారు. తల్లి వంటింట్లోకి వస్తూ "బాబూ! నాన్నగారికి అట్టే పెట్టినవానినికూడ తింటున్నారేమిటిరా!" అని కేక వేసింది.

ఒక పిల్లవాడు "మమ్మలను మాట్లాడించ కమ్మా! నీవేగా తినేటప్పుడు మాట్లాకూడదని చెపుతుంటావు - పూర్తికానియ్యి" అన్నాడు.

♦ ♦ ♦

ఒక ఎలిమెంటరీస్కూలు మాష్టరు తరగతిలో పాఠము చెప్పుతూ "కరెక్టుటైము ఎలా కనుక్కో గలరో చెప్పగలరా" అని అడిగాడు

ఒక బాలుడు లేచి "మా యింట్లో ఒక గడియార మున్నది సార్! అది ఎప్పుడు చూచినా ఒకే టైమును చూపుతుంటుంది. అదే కరెక్టుటైము" అన్నాడు ధీమాగా.

♦ ♦ ♦

భోజనం దగ్గర తండ్రి పిల్లలతో "ఎప్పుడూ కొంచెము వెల్తిగా భోంజనం చేయడం మంచిది" అన్నాడు.

ఆరేండ్ల కూతురు "అవును నాన్నా! మీరు చెప్పినట్లు గొంతుక కొంచెము వెల్తిగానే తింటాము" అన్నది.

యస్. చిరంజీవి

బిచ్చగాడు:—"బీదవాడిని బాబూ! కాని డబ్బివ్వండి"
ఒక పెద్దమనిషి:—"చిల్లరలేదు పోవోయ్."
బిచ్చగాడు:—"నా దగ్గర ఉన్నదండీ!"
పెద్దమనిషి:—డబ్బులు లేవు.
బిచ్చగాడు:—ఆ మాట మొదటే చెప్పకూడదా బాబూ!"

♦ ♦ ♦

ఇద్దరు చెవిటివాళ్లు స్టేషను ప్లాట్‌ఫారంమీద కలసికున్నారు. ఒకాయన మరొకాయనను "ఎక్కడి దాక కృష్ణయ్యగారూ!" అని అడిగాడు.

"ఎక్కడినుండి వస్తున్నానని అడుగుతున్నారా! ఇంటినుంచే—రాజమండ్రి వెళదామని వచ్చాను."

"ఇంటికెళ్తూ యూరకనే వచ్చారా! నేను రాజమండ్రికి వెళ్ళుతున్నానులెండి! వెళ్ళివస్తాను."

చివరకు యిద్దరూ రైలు ఎక్కారు,

బొడ్డుపల్లి కృష్ణావధాని

# శ్రీ సాయిబాబా మహాపుణ్యతిథి

## స్వామి కేశవయ్యజీ సందేశం

—(o)—

కలియుగములో దైవసాక్షాత్కారమునకు భక్తియే సులభమార్గము. "కలిలో హరి స్మరణం ఒకటియే కాక ఇతర మార్గం" అనే త్యాగరాజు కీర్తన. మన అజ్ఞానంవల్ల పురుషార్థములను అవగాహన చేసుకోక పోవడంవల్ల ఏర్పడిన అనర్థాలన్నిటినుంచీ విముక్తి పొందడానికి వ్యర్థచింతనలకు స్వస్తిచెప్పి ఏకాగ్రతతో దైవభక్తిని అలవరచుకోనవలసిన అవసరాన్ని విశదం చేస్తున్నది. వాస్తవమైన ఆనందం, జీవన వికాసానికి మూలం, మానవుని అంతరంగములోనే కలదని చాలా మందికి తెలియుటలేదు — తెలుసుకోలేరు. ప్రళయ బీభత్సములైన తుఫానులు చెదరగొట్టలేని ప్రశాంత ధామములు మహాసముద్రములో కలవు. అదేవిధముగా హృదయంలోకూడా భగవంతుని పీఠం ఉన్నది. అరిషడ్వర్గ వికారాలూ, కామక్రోధాది తుఫానులు, పాపవాంఛలు అనే సుడిగుండములవంటి వాటికి ఆ పీఠము అందదు. దాని దరికి ఇవి పోజాలవు.

ఆత్మచింతనము అలవడి, ఆత్మవికాసము కలిగి ఆత్మసాక్షాత్కారమైన స్థితిలో ఇంద్రియములు కలిగించుకష్టసుఖములు పాండిత్యమువలన కలిగే సంతోషము రసానుభూతి ఇచ్చు ఉల్లాసము పేలవము లవుతవి. కనుకనే ఆత్మ సాక్షాత్కారమే మానవ జన్మ పరమావధి అని ఆదిశంకరులు ప్రబోధించిరి. "తత్వమసి" "అహం బ్రహ్మాస్మి", "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను మహావాక్యముల ద్వారా ఈ సంగతి విశదమవుచున్నది. అంటే రాగద్వేషముల నుంచి జనించిన కలుషములన్నింటినీ హృదయమునుంచి తుడిచివేసి, ఆత్మపరిశోధన చేసుకొని, హృదయములను దైవభక్తితో నింపివేయుట మన కర్తవ్యము. త్రికరణ శుద్ధిగా భగవంతుని నమ్మి ఆరాధించుట భక్తి; సర్వమూ దైవార్పణము చేయుట భక్తి; ఏకైక లక్ష్యముగా భగవంతుని నమ్ముట భక్తి. అందుకే భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ ఇట్లు ప్రబోధించిరి.

"సర్వ ధర్మాన్ పరిత్యజ్య మామేకం
శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్ష
యిష్యామి మాశుచః"

"అనగా అన్నింటినీ వదలి, నాకు అన్నింటినీ అర్పణచేసి నా దగ్గరకు మాత్రమే వచ్చి నన్ను ఆశ్రయించు! విచారపడకు! పాపము లన్నింటినుంచీ నిన్ను నేను విముక్తిని గావించెదను."

"తనను తాను విస్మరించి, నేను తనముందు ఉన్నట్టు భావించి, నా నామమును జపించుచూ, భజన చేయు వ్యక్తికి, నాట్యము చేయుమనిషికి నేను వశుడను" అన్నాడు. అర్జునునితో శ్రీ కృష్ణపరమాత్మ. భక్తి మహిమను ఇంతకంటె విశేషముగా వివరించు పదజాలయి కనిపించదు.

ధర్మము అడుగంటి, అధర్మము ఎక్కువైనప్పుడు సచ్ఛీలురను రక్షించి దుష్టులను శిక్షించి ధర్మ సంస్థాపన జేయుటకు ప్రతియుగములోను తానవతరింతునని భగవంతుని మాట. తదనుగుణముగా శ్రీరాముడు, శ్రీ కృష్ణుడు, బుద్ధుడు, రామకృష్ణ పరమహంసవంటి మహనీయులు అవతరించిరి. అటువంటి మహాపురుషులలో షిర్డీ సాయిబాబా ఒకరు. వెంకుసా అనే తన గురువు అంటే అచంచల భక్తివిశ్వాసములు గలవను సంగతి తప్ప శ్రీ సాయిబాబా బాల్యమును గురించి ఎక్కువగా ఎవరికీ తెలియదు. షిర్డీలో మొదట ఒక వేప చెట్టుకింద శ్రీ సాయిబాబా నివాసము; ఆ తరువాత శిథిలావస్థలో ఉన్న ఒక మసీదులోనికి మారి ఆ మసీదుకు ద్వారకామాయి అని పేరుపెట్టారు. మహా

సమాధిలోకి పోయేవరకూ ఆ మసీదులోనే శ్రీ సాయిబాబా నివాసము. భవిష్యత్తు సంగతి ఆలోచించకుండా, వ్యక్తిగత సుఖాలన్నింటినీ నిర్లక్ష్యంచేసి, బ్రహ్మచర్య వ్రతము ననుష్ఠించుచూ, నిజమైన సన్యాసిగా జీవించిన వ్యక్తి శ్రీ సాయిబాబా. మొదట మొదట కొన్ని మందులు ఇచ్చి వ్యాధులను నయము జేసినా, ఆ తరువాత, ద్వారకామాయిలోని పవిత్రాగ్నినుంచి కొంత విభూతితీసి ఇచ్చి, వారివారి బాధలను శ్రీ సాయిబాబా పోగొట్టారు. ద్వారకామాయిలో ఆ పవిత్రాగ్ని నిత్యాగ్నిహోత్రంగా నేడుకూడా జ్వలించుచునే యున్నది.

దయాసత్య శౌచములమూర్తి శ్రీ సాయిబాబా. మానవులందరిపట్లనూ ఆయనకు విశేష ఆదరాభిమానములూ, కారుణ్యమూ ఉండేవి. ఆయన శక్తి భక్తులకు వెంటనే సత్ఫలితములను ఇచ్చెడిది. ఒకసారి ఆయన దృష్టిపడిన భక్తుల పాపములన్నీ పటాపంచలయ్యేడివి.

మొదటి సందర్శనములోనే భక్తుల హృదయములలో ఆయన చిరస్థాయిగా నిలిచేవారు. భక్తులను ఆధ్యాత్మిక జీవనములోకి మార్చేవారు. అయినా, కొంతమంది సంశయాత్ముల సందేహములను నివృత్తి చేయుటకు, శ్రీ కృష్ణభగవానుడు తన గురువు కొడుకును బ్రతికించి తెచ్చినట్లు, మసీదులోని దీపములను నీటితోనే వెలిగించుట, ఆశలువదులుకొన్న భక్తులకు సంతానప్రాప్తిని కలిగించుటవంటి చమత్కారములను అప్పుడప్పుడు శ్రీ సాయిబాబా చేసిరి. దేవుని మహిమ, ఈశ్వరశక్తి పట్ల కొందరి హృదయములలోగల సందేహములను నివారించి, భక్తిజీవనమునకు మరలుటకు వీలుగా శ్రీ సాయిబాబా ఇటువంటి చమత్కారములు చేసెడివారు.

శ్రీ సాయిబాబా "సత్పురుషుడు" త్రికాలజ్ఞాని. భూత భవిష్యత్ వర్తమానములు ఆయనకు కరతలామలకములు. వేదములు, ఉపనిషత్తులూ ఖురాన్ బైబిల్ లలోని విశేష ధర్మములు వాటంతట అవి శ్రీ సాయిబాబాకు అవగత మయ్యేడివి. నిత్యజీవితములో అందరికీ కలిగే అనుభవాలలో నుంచి విశేష ధర్మసిద్ధాంతములను భక్తులకు శ్రీ సాయిబాబా ప్రబోధించెడివారు.

శ్రీ సాయిబాబాకు భూలోక యాత్రను 1918 లో చాలించారు. ఇప్పటికి నలుబది ఏండ్ల క్రిందట సరిగా ఇదేరోజున శ్రీ సాయిబాబా జీవయాత్ర చాలించారు. నేడు ఆయన పుణ్యతిథి. మహాసమాధిలోకి పోయే ముందు ఆఖరివాగ్దానముగా "విచారపడవద్దు. నేను మరణించను. ఇంత కాలమూ మీరు చూచుచున్న ఈ కాళ్ళూ, ఈ చేతులూ, ఈ శరీరమే నేనుకాదు. సర్వాంతర్యామిని నేను. జననిర్జీవములను నేను. శరీరము లేకపోయినా మీరు ఎక్కడ ఉన్నా మీతో నేనూ ఉండెదను. మీరు తలచుకొన్నంతమాత్రాననే నేను మీ దగ్గరికి రాగలను. నా సమాధి మీతో మాట్లాడును. ఈ సమాధి మీకు మార్గముచూపించి నడిపించును. మీ అందరికీ ఇదే నా రక్ష" అని శ్రీసాయిబాబా అనిరి. ఆ మాటలు నిజమే అయినవని మనం అందరమూ తెలుసుకొనగలుగుతున్నాము. సర్వదా శ్రీ సాయిబాబా మనలను ప్రోత్సహించి నడిపించుచున్నారు. హృదయపూర్వకముగా శరణు వేడితే మన బరువు బాధ్యతలను తానువహించి మనకు కావలసిన సౌకర్యములను కలిపించుటకు శ్రీ సాయిబాబా సిద్ధముగా ఉన్నారు. చాలామందిని శ్రీసాయిబాబా కాపాడిరి. చాలామంది జీవితాలను సుఖమయము చేసినవారు. అజ్ఞులమై అంధకారమున పడి మనమందరమూ పడి కొట్టుకొంటున్న ఈసంసార యాత్రలో చాలామందికి శ్రీ సాయిబాబా బాసటఅయి, ప్రోత్సాహపరచి సక్రమమార్గమున నడిపించినారు. జీవించి ఉండగా ఒక్కసారి అయినా శ్రీ సాయిబాబాను చూడని అనేకమంది తమ సర్వస్వమూ శ్రీ సాయిబాబాయేనని భావించి విశ్వసించినంతమాత్రమున వారినందరినీ శ్రీబాబా రక్షిస్తున్నారు.

ఈ పవిత్ర మహూర్తమున, భగవద్గీతలో శ్రీకృష్ణ

పరమాత్మ చెప్పిన మాటలను మనమందరమూ గుర్తు చేసుకొనెదము గాక

"నన్నే తమ సర్వస్వముగా భావించి, విశ్వసించి, నన్నే ఆరాధించువారికి సుఖశాంతులను కలిగించెదను. వారి మేలు సంగతి నేనే చూచెదను. ఓ! కౌంతేయా! నా భక్తునికి నాశనమన్నది ఎన్నడూ ఉండదని ఎరుగుము."

శ్రీకృష్ణ పరమాత్మ చెప్పిన ఆ మాటలనే మహా సమాధిలోకి పోకముందు శ్రీ సాయిబాబా అనేక సార్లు చెప్పిరి. శ్రీ సాయిబాబా మనకు మార్గము చూపించుగాక! శ్రీ సాయిబాబా మనకు సుఖశాంతులను ప్రసాదించుగాక! శ్రీ సాయిబాబా మనలను రక్షించుగాక! ఆయన కృపాకటాక్షము మన అందరి మీదా ప్రసరించుగాక!

---

ఒక ముసలాయన:—అమ్మాయ్! మీ నాన్నగారింట్లో నున్నారా?

అమ్మాయి:—లేరండీ!

ముస:—ఇంత ఎండలో ఎక్కడికి వెళ్ళాడంటావు?

అమ్మా:—ఈ ఎండలో మీ రెక్కడికి వచ్చారు?

మరువాడ సూర్యప్రకాశం

# గోతిలో పడనున్న వారెవరో!

'భగవాన్ దాస్'

—(౦)—

శారద జీవితము అలా తారుమారగుతుందని ఎవరూ అనుకోలేదు. మంచి తెలివితేటలతో స్కూలు ఫైనలు దాక చదువుకున్నది. రంగనాథం, ఆమె పెద్ద కూతురు కావడంవల్ల మోజుకొద్దీ అల్లారుముద్దుగాపెంచి మంచి సంబంధముచూచి కట్నకానుకలతో వివాహంచేయ తలపెట్టాడు. కాని తానొకటి తలచితే దైవమొకటి చేసినట్లు పెండ్లికి తన స్థిమితానికి మించిన ఖర్చయిందే కాని శారదకు మాత్రము సుఖ సౌభాగ్యాలు సమకూరలేదు.

రంగనాథం అనుభవం చాలక దళారుల మాటవిని నాలుగువేల రూపాయల కట్నకానుకలిచ్చి ధనధాన్య సంపదలుగల యింట్లో కూతురు సుఖపడుతుందని శారదను రామారావుకు యిచ్చి వివాహం చేశాడు. తీరా పెళ్లయిన తరువాత చూస్తే లోన లొటారం, పైన బటారంగా కనుపించినవి రాఘవయ్యగారి కుటుంబ పరిస్థితులు. రాఘవయ్యగారి ఆస్తిపాస్తులను గురించి తాను విన్నదానికి, తర్వాత రుజువయిన దానికి హస్తిమశకాంతమంత భేదం కనుపించింది. అల్లుడు దండయాత్రలలో గజనీమహమ్మదును మరపిస్తూ ఎలాగైతేనేం స్కూలుఫైనలు ప్యాసయి, స్కూలుమాష్టరు ట్రెయినింగ్ అయ్యాడు. చిన్నకొడుకులు ముగ్గురు యించుమించుగా దండయాత్రలలో అన్నయ్యతో సరితూగుతూ చదువుతున్నారు. రాఘవయ్యకున్నది కొద్దైతే లేనిఘనతను తెచ్చిపెట్టుకుని పరవళ్లు త్రొక్కుతుండేవాడు. ఆడపిల్లలకు మాత్రం ఏదో విధంగా పెండ్లిచేసి అత్తవారిండ్లకు కాపరానికి పంపించాడు. రామారావుకు చదువు సంధ్య లెట్లున్నా లోకజ్ఞానంగాని, స్వీయ బాధ్యతలుగాని, ఉత్తమమైన నైతిక స్థాయిగాని తెలియవు. 'ఇంట్లో యీగల మోత, బయట పల్లకీల మోత' అన్నట్లు రాఘవయ్యగారి ఆర్భాటం. పరవళ్ళు మాత్రం చెప్ప శక్యమయ్యేవికావు. ప్రతియొక్కరిని వ్యాఖ్యానిస్తూ, విద్దేవ చేస్తుండేవాడు. రంగనాథం పొరబడి రాఘవయ్యతో సంబంధము చేయడం చూచి ఆ యూళ్లో అనేకులు "ఈ మాత్రము సంబంధము దొరకక కాబోలు యింత కట్నకానుకలిచ్చి చేశాడు పిచ్చిబ్రాహ్మడు" అనుకున్నాడు.

శారద తెలివితేటలకు, ఆమెకు చదువు పట్లయుండిన శ్రద్ధాసక్తులకు పెండ్లికని ఖర్చుచేసిన నాలుగయిదు వేలరూపాయ

లలో ఉన్నతవిద్య చెప్పించినా అమ్మాయికి కష్టాలుండేవి కావు; రంగనాధంకు మానసిక వ్యథ యుండేది కాదు.

రామారావు ఆ యూళ్ళోనే ఎలిమెంటరీ స్కూలులో పనిచేస్తూ వచ్చినది వచ్చినట్లు జీతాన్ని రాఘవయ్య దోసిట్లో పోసేవాడు. తనకు కానిడబ్బు కావలసినా తండ్రినడుగాలి, అడిగితే ఒక మాత్రాన రాగిదమ్మిడి సయితం యిచ్చేవాడుకాదు రాఘవయ్య. శారద కాపరానికి పోయేంతవరకు తండ్రికొడుకుల కుమ్ములాటలో ఎలాగో జరిగిపోయింది. రాఘవయ్య యింట్లో జరుగుబాటును గమనించకుండా నెలకు యిరవై రోజులు ఆ వూరు, యీ వూరు కోర్టుపనులకని తిరుగుతుండేవాడు. అయిదారుగురు తిన, కుడువయున్న సంసారంలో జరుగుబాటుకు పండివచ్చిన ధాన్యమును యింట్లో చిన్న, పెద్దకూడ కొట్లకు పోయాల్సి వచ్చేది. అందుకని సంవత్సరానికని అట్టే బెట్టిన ధాన్యము ఆరు నెలలకే అయిపోవడం, తర్వాత యితర నిత్యావసరవస్తువులతో బాటు బియ్యానికి సయితము అలమటించడము సహజమయిపోయింది. శారద కాఫరానికి వచ్చిన క్రొత్తల్లో ఆమెకిదంతా అయోమయంగా తోచింది. కోడలు వచ్చిన తరువాత అయినా రాఘవయ్య ధోరణి, యింటిపరిస్థితులు చక్కబడ్డ పాపాన పోలేదు సరిగదా మరింత ఎక్కువగా వెర్రితలలు వేసినవి.

శారద కాపరానికి వచ్చినప్పటినుండి నల్లనిదని, ఇంట్లో అడుగుపెట్టినప్పటినుండి దరిద్రం చుట్టుకున్నదని, బహిరంగంగా రాఘవయ్య పదం పాడసాగాడు. ఇంట్లో ఎవరికి ఏ కొద్ది జబ్బు చేసినా 'యిది మా కోడలు యింట్లో అడుగు బెట్టిన వేళా విశేష'మనేవాడు. ఆ వేళకు, యీ వేళకు తినే నాలుగు మెతుకులు తప్ప శారదకా యింట్లో అచ్చట్లు, ముచ్చట్లంటూ లేక పోగా తల దువ్వి జడ వేసుకోడానికి కొబ్బరినూనెకు సయితం ఆ యింట్లో ఎప్పటికప్పుడు కరువే. ముచ్చటగా ముత్తైదు ఆడపిల్లకు అణా డబ్బులకు వూలు కొనిపెట్టడానికి ఏనాడూ చేతులురావు రాఘవయ్యకు. తిన దలచుకొని ఏదైనా బజారునుండి తెప్పించుకుందామన్నా మామగారి స్తేగా తనకైనా, తన భర్తకైనా డబ్బులంటూ! అప్పటికీ రామారావు చాటుమాటుగా వూళ్ళో అప్పో, సప్పో చేసి శారదకు ఏదైనా కొని తెచ్చిపెడితే రాఘవయ్య బజారుకుపోయి "మా వాడికి అప్పియ్యవాకండి; యిస్తే వసూలు చేసికోవాల్సిన బాధ్యత పూర్తిగా మీదే" నని చెప్పి వచ్చేవాడు.

రాఘవయ్య శారదనుచూచి ఎప్పుడూ రుసరుసలాడుతుండేవాడు. కోడలు, కొడుకు కలసి మాట్లాడుకోడాన్ని రెండు

కళ్ళతో చూచి ఓర్వలేకలిగేవాడుకాడు. రామారావును యింట్లో ఒక్క క్షణమైనా నిలువనీయక ఎప్పుడూ బయట తిరుగమనే వాడు. ఎంత వినయంగా, ఒద్దికగా, పని పాటలలో మెలకువగానున్నా ఏదో సాకుతో కసురుతూనో, సూటీపోటీ మాటలంటూనో, శారద పుట్టింటివాళ్లు సైకిలిస్తామని, చేతిగడియారమిస్తామని, యివ్వలేదనే నిందలతో, దెప్పిళ్ళతో రచ్చచేస్తుండేవాడు. ఇదంతా చూస్తూన్న శారద తనిలా ఎంత కాలం యమచరపడగలనా! యని ఆలోచిస్తుండేది.

తమ నెలకు డెబ్బైరూపాయలు సంపాదిస్తూ తనయొక్క, భార్యయొక్క అవసరాలకు అప్పులు చేయడమేమిటి! వచ్చిన జీతాన్ని తండ్రి గుంజేసుకుంటుంటే అప్పులు తీరక నలుగురి నోళ్ళలో నానడమేమిటూ యని ఆలోచించి తమ ఖర్చులకు తన జీతంలో నెలకు కనీసం 15 రూపాయలైనా తీసికుంటానన్నాడు. అలా వీలుకాదంటే కాదన్నాడు రాఘవయ్య. జీతం మొత్తం తనకివ్వకపోతే యింట్లో, కాదుకదా, ఆ యూళ్ళో కూడ నుండటానికి వీలు కాదన్నాడు. దాంతోటి రామారావు బదికి పోవడం మానేశాడు. రాఘవయ్య ఒకటి రెండు సార్లు కొడుకు, కోడలిని బెదిరించాడు. ఏదెట్లైనా సరే తన అవసరాలకు కొంతానికి కొంచమైనా వినియోగపడని సంపాదనతో తనకు నిమిత్తము లేదని బిర్ర బిగుసుక కూర్చున్నాడు రామారావు. తన మాటను లక్ష్యము చేయలేదనే కచ్చతో స్కూలులో ఉద్యోగమునుండి తొలగింప జేశాడు రామారావును. మొదలే ముక్కిడి, ఆ పైన పడిశమన్నట్లూ సంపాదిస్తున్న రోజులలోనే రచ్చ, రద్దితో ఆ యింట్లో జీవనం గడుస్తుంటే యిక ఉద్యోగం, సద్యోగం లేకుండా కూర్చొని స్తాడా రాఘవయ్య కొడుకును! భార్యాభర్తలిద్దరు ఆ యింట్లో నుండలేకపోయారు. మరెక్కడైనా జీవనోపాధి కల్పించుకుందామని ఆ యిల్లు వదలి బయలుదేరారు. శారదను పుట్టింటికి పంపి, రామారావు ఉద్యోగాన్వేషణ మొదలు పెట్టాడు. అప్పటినుండి కుటుంబం ఆస్తి నుండి రామారావుకు ఏ మాత్రం దక్కకుండా చేయాలని నిశ్చయించుకున్నాడు రాఘవయ్య.

రాఘవయ్యగారి యింట్లో పరిస్థితులను, పరిణామాలను గురించి విని రంగనాథం దంపతులు నిర్విణ్ణులయినారు. తన కూతురు కాగతి పట్టినందుకు రంగనాథం తనే కారణమని పశ్చాత్తాప పడ్డాడు. రాఘవయ్యకు ఆ యూళ్ళోని పెద్దలచే న్యాయం, ధర్మం చెప్పిద్దామంటే రాఘవయ్య వినేవాడుగా కనుపించలేదు. ఇకముందేం

జరుగాలనాయని మథనపడసాగారు రంగనాథం దంపతులు.

రామారావుకు ప్రక్క జిల్లాలో నొక చోట ఉద్యోగం దొరికింది. నెలకు ఎనభై రూపాయల జీతంతోబాటు, మరొక ఎనభై రూపాయల ఆదాయం సమకూర్చగల ప్రైవేటు ట్యూషన్‌లు దొరకినవి. శారదను పిలుచుకొనివచ్చి కాపరం పెట్టాడు. వచ్చే ఆదాయంతో చీకుచింతా లేకుండా భార్యా భర్తలు జీవయాత్ర చేయడానికి అవకాశాలు ఏర్పడినా వానిని వినియోగించుకోడానికి యోగ్యతలు లేకపోయినవి రామారావుకు.

కొంతకాలం సంసారం ఏగొడవలు లేకుండ సౌమ్యంగానే గడచింది. తర్వాత క్రమంగా తనకు పెళ్లిలో యిస్తానన్న సైకిలు చేతిగడియారం మామగారింకా యివ్వలేదని రామారావు శారదమీద రుసరుస లాడసాగాడు. తండ్రికి జాబు వ్రాసి తెప్పించి పెట్టమనీ హంగామా మొదలు పెట్టాడు. శారద తనకు వానిని గురించి తెలియదు కాబట్టి ఆయన్నే వ్రాసియో, అడిగో తెప్పించుకోమన్నది.

అసలే రాఘవయ్య అయోగ్యతకు, వారి అయోమయ కుటుంబ పరిస్థితులకు విచారపడుతూ తల్లిదండ్రులు ముందు ముందు తన గతి ఏమికానున్నదాయని ఆందోళన పడుతుంటే 'మా వారికి గడియారం, సైకిలి కొనిపెట్ట'మని ఎలా అడుగుతుంది శారద మాత్రం! ప్రతి రోజు శారదను తండ్రికి జాబు వ్రాయమని రచ్చ. క్రమంగా యిద్దరు కొట్టుకోడమల్లాపోయి రామారావు కొట్టి, తిట్టి బెదిరించ సాహసించాడు. అప్పుడు శారద తండ్రికి జాబువ్రాస్తే విశ్వనాథం ఏదో మునిగిపోతున్నట్లు కంగారుగా వచ్చాడు. రామారావు ఎదటికివచ్చిన మామగారిని సైకిలు, గడియారం అడుగడానికి బదులుగా "శారదను మీ వెంట పిలుచుకెళ్లండి; నేనైనా యీ యుద్యోగం ఎంతకాలం చేస్తానో చెప్పలేకున్నాను" అన్నాడు. శారద పుట్టెడు దుఃఖంతో, విరక్తితో తండ్రి వెంట పోవడానికి ప్రయాణమయింది. రంగనాథం ఎంతగానో ఆలోచించి పోనీ కొంతకాలంపాటు తమ దగ్గర ఉండి వస్తుందిలే అని శారదను పిలుచుకొని పోయాడు.

తర్వాత మూడురోజులకు సునాయాసంగా ఉద్యోగానికి రాజీనామాయిచ్చి రైలెక్కి రామారావు స్వగ్రామానికి యిల్లుచేరాడు. ఎప్పుడు అవకాశం చిక్కుతుందాయని ఎదురుచూస్తున్న రాఘవయ్య రామారావు పట్ల లేని ఆదరాభిమానములను తెచ్చిపెట్టుకొని, ఆ మాట, యీ మాట తీయగాచెప్పి, తల్లిచేత చెప్పించి కుటుంబం ఆస్తికి, తనకు ఎలాటి సంబంధము లేనట్లుగా రామారావు

చేత స్వదస్తూరితో కాగితం వ్రాయించుకున్నాడు. తనకు కావలసినపని అయింది. ఇక యథా ప్రకారము మంగళ హారతులు, స్వస్తి ప్రారంభమయినవి. చిన్న కొడుకులను ప్రయోగించి రామారావును యిల్లు వెడల కొట్టించాడు.

ఈ విషయం తెలిసి రంగనాథం దంపతులకు హృదయం నీరయింది. ఏమిచేయాలో తోచలేదు. రామారావు దేశద్రిమ్మరై ఎక్కడ తిరుగుతున్నాడో అంతులేదు. శారదను ట్రైనింగుకు పంపి ఆ యూళ్ళోనే హైస్కూలులో టీచరుగా ఉద్యోగం సంపాదించారు.

రాఘవయ్యకు కోడలే మయిందో, కొడుకేమయినాడో అనే విచారమేలేదు. పానకాలరాయుడులాగ కట్నకానుకలను, కుటుంబ ఆస్థిలోని కొడుకు వాటాను దిగమ్రింగి యింకా ఏదైనా చేతికి చిక్కుతుందేమోనని ఎదురు చూస్తున్నాడు రాఘవయ్య. తర్వాత మరెవ్వరు పడాల్సియున్నదో ఆ గోతిలో!

——(o)——

# ప రి ణా మ ము

శ్రీ గాడేపల్లి శంకరం

——(౦)——

ప్రథమాంకము :

మొదటి రంగము

ప్రదేశము : యుద్ధభూమి

ప్రవేశము : ఉన్మత్తుడు (ఒక సిపాయి)

(రణదుందుభులు మ్రోగుతాయి - జయజయ ధ్వానాలు వినబడుతాయి - లాల్ ఖిల్లామీద జండా యెత్తిన సంరంభం కలుగుతుంది.)

తెరలేచి

——:నాంది:——

పృధ్వీశ్వరు డెదిర్చి వేల్చిన హోమాజ్ఞి
గజనీ విజృంభణోగ్రత నడంచె!
పాంచాల ఘూర్జరప్రభు పరాక్రమకీల
కలిసిన తురకసంఘాల నోర్చె!
రాజపుత్రప్రభా ప్రాణార్పణ పటిష్ఠ
వీరవిహార మేవేళ వెలిగె!
ఛత్రపతి శివాజీ జాజ్వల్యరణవహ్ని
మొగలు సామ్రాజ్యంబు మంటబెట్టె!
భారతావని పరతంత్ర భారముడుగ
ఆంగ్ల సామ్రాజ్య రాక్షసియసువులార్ప
పోరుమంబున్న హైందవుల్ ప్రళయముగను
పోరుచున్నారు లేలెండు! శూరులార!
అదె! లక్ష్మీరణవహ్ని అయ్యెదె
అయోధ్యా ప్రాంగణజ్వాల
అల్లదె! ఢిల్లీనగరోగ్ర విక్రమ విహార
ప్రాభవంబు
అయ్యెదే యెదురై నిల్వగలేని ఆంగ్లదొర
లెందెందో
పరాభూతులై - కదనాజ్ఞింబడి క్రుందు
చుండిరిదె వీకంబాఱ క్రొన్నెత్తురుల్

---

ప్రాభాత ప్రాంగణాన మ్రోగేను నగారా!
ఈ భారత భువిని పొంగేను ముక్తజీవధార!
లేవోయి లే లే లే మ్రోగేను నగారా!
పొంగె జీవధారా!

చిరదాస్యం పోరబాటు
పరప్రభుత దొంగవేటు
లేవోయి లే లే లే - మ్రోగేను నగారా
పొంగె జీవధారా!

నీ శీర్షం హిమశృంగం
నీ యెద గంగా భంగం
నీ దేశం నీదే!
నీ భారతదేశం!
మన భారతదేశం!
ప్రజలందఱికోసం ॥ ప్రాభాత॥
నీ మనస్సు సువిభాతం
నీ రక్తం జలపాతం
నీ దేశం నీదే
నీ భారతదేశం
మన భారతదేశం



4

ప్రజలందరికోసం ॥ ప్రభాత ॥
మతభేదం చెడు తంత్రం
మగతనిద్ర ఒక మంత్రం
లేవోయి లే లే లే మ్రోగేను నగారా
పొంగె జీవధారా! ॥ ప్రభాత ॥
నీ గతమ్ము మూలధనం
నీ భావి వసంతవనం
నీ దేశం నీదే – నీ భారతదేశం
మన భారతదేశం – ప్రజలందరికోసం ॥
లేవోయి లే లే లే మ్రోగేను నగారా
పొంగె జీవధారా! ప్రభాత ॥

(చీకటిమయం. జాలిగా సంగీతం వినబడుతూ వుంటుంది. ప్రవేశం ఉన్మత్తుడు, విఫలమనోరథుడైన ఒక శిపాయి.)

రణదుందుభులు మ్రోగటంలేదు! జయజయధ్వానాలు జయభేరీలు వినిపించటంలేదు! విప్లవజ్వాలలు చల్లారిపోయాయి. వీరాగ్రేసరులైన శిక్కులు అటు వీగిపోతే శూరాగ్రేసరులైన సిపాయిలంతా పాపం సోలిపోయారు. మానవాగ్రేసరులంతా మాయమైపోయారు. గాఢాంధకార బంధురమైన కాళరాత్రి కారుమేఘాలు క్రమ్మిన కటికచీకటి. మన్నేదో మిన్నేదో తెలియని మాయలోకం గాఢనిద్దురలో కన్నుమూసిందే, ఉచ్ఛ్వాస నిశ్వాసాలైనా వినబడటంలేదు.

నోరు తెరువనిమాట, లయరహితమైన పాట, అంతు తెలియని బాట.

రోదన ధ్వనులు వినిపించటంలేదు, రోదించేవారు కనుపించటంలేదు ... నేనైనా సజీవుడనై ఉన్నానో లేదో! ఏదీ! ఉంటే, పరప్రభుత్వ దాస్యశృంఖలాలలోచిక్కి శల్యావశిష్టమైన భారతమాత నీకు కనబడలేదూ? అదిగో! ఇనుపపాదాలక్రిందపడి ఎలా నలిగిపోతోందో! అదిగో అలా ఒక్కసారి చూడు మరి, ఆ దొర్లదోపిడీ చూడు, ఆ దొంగదొరల ధాటీ చూడు! పాడి పంటలు సన్నగిల్లిన పల్లెగ్రామాలు చూశావా?

పంచాయితీలు నశించిపోయాయి, స్వాతంత్ర్యశక్తులు అడుగంటిపోయాయి. ఆ నోరులేని పశువుల మందను, ఆ బుర్రలులేని గొర్రెల గుంపునిచూడు, ఆ బక్కచిక్కిన రైతులచూశావా? బ్రతుకు తెరువులేని యువకుల పరికించావా?

కుక్కల గూళ్యాలలోను, నక్కల బొరియలలోను నివశిస్తున్నారు. చేతిపనులు నశించిపోయాయి- వృత్తిపన్నులు వచ్చిపడ్డాయి - చదువు సంధ్యలు చల్లబడిపోయాయి - చావు బ్రతుకులు సిద్ధమైనయి- చింపిరి జుట్టులతో, చినిగిమాసిన దుస్తులతో నిలువడానికి నీడలేక, ఉండటానికి తావులేక, పగలంతా శ్రమపడి పనిచేసినా పొట్ట నింపుకోటానికి పట్టెడన్నమైనా లేని గర్భదరిద్రులచూస్తే నీకు గర్భనిర్భేదంగా లేదూ! నీ గుండెలు బ్రద్దలుకావడంలేదూ?

దొప్పలతో తెచ్చిన కూడును దోసిట్లోనే తింటూ ఏ అరుగుపంచనో, ఏ కాలిబాటనో నిదురించే నిత్యదరిద్రులు నీకు కనబడటంలేదూ!

శుచి శుభ్రతలు లేవు, క్రమపద్ధతులు కానరావు, అసహ్యం, అనారోగ్యం, అవిద్య, అజ్ఞానం తాండవిస్తున్నాయి.

సాంఘిక పరిజ్ఞాన శూన్యత, సహకార భావనాలేమి, తాళంవేస్తున్నాయి. నవనాగరికపు దొంగలు, తిండిపోతురాయుళ్లూ చూసి ఆనందిస్తున్నారు.

ఆఁ ఆఁ కోటానుకోట్ల ప్రజలరక్తం పీల్చుకు తింటున్నారే! కొన్ని తరాలనుండి దాచుకొన్న ధన కనకవస్తు వాహనాదులు తరలించుకుపోయారే! జ్ఞాపకంలేదూ? స్ఫురణకురాదూ? నీకు శౌర్యంలేదూ? నీవు పురుషుడవు కాదూ, అయితే మేలుకో!

మరి నీ దేశం ఏలుకోవోయి! ఏలుకో! మేలుకో, ఏలుకో. (అటూ నిష్క్రమిస్తాడు.)

సూచన:-డక్టరురావు (ఒక కాంగ్రెసు వర్కరు) కొందరు వాలంటీర్లతో జయ జయధ్వానాలు చేసుకుంటూ జండాలు పట్టుకొని ఊరేగుతూ వెళ్ళిపోతారు - (1920)

రెండవ రంగము

ప్రదేశము:-స్వామినాయుడుగారి ఇంట్లో కచేరి సావిడి.

ప్రవేశము:-స్వామినాయుడు వయస్సు 50 ఏళ్లుంటాయి. టేబిలు రెండు మూడు కుర్చీలు, వుంటాయి. కుర్చీలో కూర్చుని పేపరు చదువుతుంటూ వుంటాడు. ఇంతలో అతని కుమారుడు మూర్తి వయస్సు 16 ఏళ్లుంటాయి. చేతిలో పుస్తకాలు అప్పుడే స్కూలునుంచి వచ్చిన వాడిలా వేషం-ప్రవేసిస్తాడు.

స్వామినాయుడు:-ఎవరదీ - మూర్తీ! నాయనా అప్పుడే వచ్చేశావేమీ?

మూర్తి: ఈవాళ స్కూలుదగ్గర కాంగ్రెసు వాలంటీర్లు పికెటింగు చేస్తున్నారు నాన్నా! ఇంగ్లీషు చదువులు మానేయమని బ్రతిమాలుకుంటున్నారు.

స్వా.నా:-ఏడిసినట్టుంది! చదువులు సంధ్యలూ మానేసి ఏమిచేస్తారు. వెళ్లు, నువ్వు స్కూలుకెళ్లు నీవు మానవద్దు.

మూర్తి:-ఎలాగ వెళ్ళడం-గేటుకడ్డంగాపడుకున్నారు-వాళ్ళను తొక్కి వెళ్ళమన్నారా?

స్వా.నా: బాగానేవుంది! వరుస - అలాగయితే ఈ పూటకి వంట్లో బాగాలేదని ఓ సెలవు చీటీ వ్రాసి పారెయ్యి. రేపటినుంచి వెడుదువుగాని-మరి ఏంచేస్తావు?

డాక్టరురావు:-(ప్రవేసించి) అన్నగారు మంచి సలహాయే యిస్తున్నారు కొడుక్కి!

స్వా.నా:-ఓహోహో? డాక్టరు రావుగారాయేమిటి? రండి రండి కూర్చోండి ఏమిటయ్యా! విదేశవస్తు బహిష్కరణాలతోపాటు విదేశ చదువులు కూడా పనికిరావంటున్నారుట మీ కాంగ్రెసువారు నిజమేనా?

డా.రావు:-అవును! ఖద్దరు ధారణ విదేశవస్తు భహిష్కరణ, హిందూ ముస్లిం సఖ్యత జాతీయ భాషా వ్యసనము, మద్యనిషేధము ఈ 1820 నాటి కాంగ్రెసు ప్రోపగాండాలోని ముఖ్యాంశాలు.

స్వా.నా:-అవునుశే దీనికీ, ఇంగ్లీషు ప్రభుత్వాన్ని తొలగించటానికి ఏమి సంబంధమో నాకు అర్థం కావటంలేదు.

[మూర్తి లోనికి వెళ్ళిపోతాడు]

డా.రావు:- మీరు పొరబడుతున్నారు. అన్నగారూ! ఇంగ్లీషువారు ప్రభుత్వాన్ని చేపట్టేముందు ఈ దేశానికి వర్తకులుగానే కదా వచ్చారు.

స్వా.నా:-అవునూ! అయితే?

డా.రావు:- వర్తకులుగా వచ్చిన ఈ ఇంగ్లీషువారు ప్రభువులైనాక ఈ దేశంలో చేసిందేమిటో తెలుసా? వాళ్ళదేశంలోని వర్తక వ్యాపారాలు వృద్ధిచేసుకున్నారు. జీవన పరిమాణాన్ని హెచ్చించుకున్నారు. మన దేశంలోని చేతిపనుల్ని నాశనంచేసి వాళ్ళ దేశంలో యంత్రసహాయంతో తయారైన సరుకుల్ని మన కంటగట్టి కోట్లకొలదీ ద్రవ్యాన్ని అపహరిస్తున్నారు. వాళ్ళ నాజూకు సరుకులకీ, వాళ్ళ సంస్కృతికీ మనం మోహపడేటట్టు చేసి, మన బుర్రలు మార్చివేసే ఈ ఇంగ్లీషు చదువులు చెబుతున్నారు.

స్వా.నా:-సరేలే! ఏదో పెద్దవాళ్ళు కాస్తో కూస్తో ఉపాధి ఏర్పాటు చేసుకోగలిగే వాళ్ళకి రాజకీయాలుగాని ఈ కుర్రకుంకలకి కూడా ఎందుకయ్యా! వాళ్లు చదువులు మానివేయడం ఎందుకు?

డా.రావు:-అయితే చదువుకోటానికి ఇంగ్లీషు వుంటేగాని వీలులేదా అన్నగారూ? మన తాత ముత్తాతలు ఇంగ్లీషు చదివే రాజరికాలు చేశారా?

స్వా.నా:-అది సరేలే! ఇప్పుడు కాస్త ఉద్యోగం ఏదన్నా కావాలీ అంటే మరి రెండు ఇంగ్లీషు ముక్కలు రానివాడికి దిక్కేదీ!

డా.రావు:-ప్రభుత్వం మన చేతుల్లోకి వస్తే అంతా మనదే కాదూ! అన్ని ఉద్యోగాలూ మనవే!

స్వా.నా:-ఆఁ మన చేతుల్లోకి ప్రభుత్వం వస్తుందీ, నేను చూస్తాను! అన్నీ నిజమే వెనకా ముందూ ఆలోచన లేకుండా పనులు చేస్తూవుంటే...

డా.రావు:-అది కాదండీ! ప్రభుత్వంచేస్తున్న ఆ వర్తకులకి నష్టం కలిగించాలీ అంటే వాళ్ళ వస్తువులు బహిష్కరించాలి. దానివల్ల మనదేశంలోని డబ్బు మన దేశంలో వుండటమే కాకుండా, మనవాళ్ళకి చేతినిండా పని దొరుకుతుంది. కడుపునిండా తిండి వుంటుంది. త్రాగుడు మానివేస్తే సంసారాలు చక్కబడుతాయి. ప్రభుత్వరాబడి దెబ్బతింటుంది. ఈ పాశ్చాత్య నాగరికతా వ్యామోహాన్ని వ్యాప్తంచేసింది ఈ ఇంగ్లీషు చదువులే కనుక, అవి కూడా బహిష్కరించమన్నారు.

స్వా.నా:-ఏదైనా మానేయగలరేమోగాని ఈ ఇంగ్లీషు చదువులు మానలేరయ్యా! మెకాలే మహా గడుసువాడు. కీలెరిగి వాత వేశాడు. ప్రభుత్వం మన చేతుల్లోకి వచ్చినా ఈ ఇంగ్లీషు చదువులు మాత్రం మనం వదలలేము.

డా.రావు:-పోనీ విదేశవస్తు బహిష్కారమైనా చేయడం మంచిదేనంటారా?

స్వా.నా:-అది అంతకన్న సాధ్యమయ్యే విషయం కాదు. యంత్రంతో మనం పోటీ చెయ్యగలమా? కావలిస్తే మన దేశంలోనే పెట్టుకోరాదూ! ఆ మిల్లులూ గిల్లులూను. ప్రపంచం ఓమూల శర వేగంతో పరిణామాన్ని పొందుతూవుంటే కాల ప్రవాహానికి ఎదురీదగలమా?

డా.రావు:-సరేలెండి ఇవన్నీ గాంధిమహాత్ముని రాజకీయపు ఎత్తులలోని అంశాలు. అవి మనం ఆచరించి ఫలితాన్ని పొందవలసినవేగాని విమర్శించడానికి వీలులేదు. ఇవాళ మన క్లబ్బుకి చెందిన మైదానంలో కాంగ్రెసు మీటింగువుంది. దానికి కాస్త అనుమతి యిస్తారేమోనని వచ్చాను.

స్వా.నా: అయ్యో దాని కభ్యంతరం ఏమిటి? ప్రభుత్వం మీ కాంగ్రెసుని అక్రమసంఘముగా పరిగణించనంతవరకూ ఏమీ యిబ్బంది లేదు.

డా.రావు:-చాలా సంతోషం మరి నేను వెళతాను.

స్వా.నా:-అవునుగాని రావూ! ఏదో ప్రాక్టీసువల్ల పదిరాళ్లు తెచ్చుకుంటేగాని సంసార గడవటం కష్టంకదా! నీవుకూడా ఎందుకంత జోక్యం పెట్టుకోవడం? రేపు ఎరెస్టూ జయిలూ అంటే. ఎంత యిబ్బంది పడిపోతావో ఆలోచించావా? నా భార్యా నీవు మేనత్త మేనమామ పిల్లలు. అది చచ్చి స్వర్గాన ఉంది. నిన్ను చూసినప్పుడల్లా అది నాకు జ్ఞాపకం వస్తూవుంటుంది. అందుచేత ఈ చనువు తీసికొని అభిమానంచేత అడుగుతున్నాను సుమా—

డా.రావు:-నా మీద మీకు అలాంటి అభిమానం ఉండటమూ సహజమే మీరు అడగటమూ సబబే. దానికేం పుర్రెకు పుట్టిన బుద్ధి పుడకలతోటేగాని పోదూ అన్నగారూ? ఈ విషయంలో నాకు మీరు అడ్డుచెప్పవద్దని మాత్రం ప్రార్థిస్తున్నాను. మానవ సేవయే మాధవ సేవన్నారు. దేశ కళ్యాణం కోసం చేసే ఏ ప్రయత్నంలోనైనా నాకు ఉత్సాహ ఉద్రేకాలు కలుగుతాయి. తప్పదు క్షమించాలి. నేను వెడతాను సాయంకాలం కలుసుకుందాము. (వెడుతాడు)

స్వా.నా:-(ఏమీ అనలేక కొంచెము సేపు ఊరుకుంటాడు) లోకాభిన్నరుచిః అన్నారు. కాని ఏమిచేస్తాం ఎవరి ప్రారబ్ధానికి ఎవరు కర్తలు కాగలరు.

(అంటూ లోనికి వెళ్ళిపోతూండగా తెర)

(సశేషము)






## క్యారెట్ హల్వా

రెండు కప్పులపాలు, ఒక ఏబులం క్యారెట్ దుంపలు, ఒక కప్పు పంచదార, రెండు టేబిల్ స్పూన్ల వెన్న, కొంచెము యాలకులపొడి, పది ఎండుద్రాక్షపండ్లు తెచ్చి అమర్చుకోవాలి.

క్యారెట్ దుంపలను బాగా కడిగి తురుముపట్టి యుంచుకొనవలెను. ఒక కళాయి పాత్రలో పాలను పోసి మరగపెట్టవలెను. మరుగుతున్న పాలలో క్యారెట్ దుంపల తురుమును వేసి బాగా కలియపెట్టవలెను. సన్నని సెగమీద ఒక గంటసేపు ఉడకనిచ్చి గట్టిపడుచున్నప్పుడు అందులో పంచదార, ద్రాక్ష, వెన్న వెయ్యాలి. హల్వా చేతికంటకుండా గట్టిపడిన తరువాత ఒక కళాయి పళ్లెమునకు నెయ్యిరాచి అందులోకి కుమ్మరించి, దానిపై యాలకులపొడి చల్లవలెను.

మజ్జి సావిత్రి

## ఢిల్లీ పాదుషా

మైదాపిండి ఒక అళాకు ($1\frac{1}{2}$ గిద్ద), అళాకు ($\frac{3}{4}$ గిద్ద) గేదపాలు, $\frac{1}{2}$ పలం నెయ్యి, ఒక అళాకు పంచదార, కొంచెము పచ్చకర్పూరము కొంచెము కేసరిపొడి తీసియుంచుకోవలెను.

ఒక కళాయి పాత్రలో ఒక గరిటెడు నీళ్లుపోసి, అందులో చక్కెర వేసి పాకముపట్టి యుంచుకోవలెను. ఆ పాకము జాంగ్రీపాకమట్లు ద్రవరూపమున నుండవలెను. తర్వాత పాలు, మైదాపిండి, కేసరి పొడి, పచ్చకర్పూరము ఒకటిగా బాగ కలిపినదానిని చిన్న నిమ్మపండంత ఉండలుచేసి అరచేతిలో బిళ్లలుగా వత్తి, వానికి పూచికపుల్లతో ఒక్కొక్కదానికి తొమ్మిది, పది తూట్లుపొడిచి బాణట్లో కాగుతున్న నెయ్యిలోగాని, డాల్డాలోగాని తేల్చి తీసి పాకంలో వేయవలెను. నాలుగుగంటలవి నానిన తరువాత చాల రుచిగా నుండును.

యమ్. ఆర్. సీతమ్మ

## క్యారెట్ల వంటకాలు

క్యారెట్లు పైపెచ్చును తీసేసి సన్నని ముక్కలుగా తరిగి తగుమాత్రంగా నీరుపోసి ఉడికించి, కొబ్బరి కోరుతో వేసిన వేపుడు రుచికరంగా నుండును.

క్యారెట్ ముక్కల సాంబార్ (పప్పుపులుసు) చాల రుచిగా నుండును.

క్యారెట్ ముక్కలు, పొట్లకాయ ముక్కలు, సొరకాయ ముక్కలు, వంకాయ ముక్కలు, ఉప్పు, పచ్చిమిరపకాయలు తరిగేసి ఉడకబెట్టి అందులో చింతపండు పులుసుపోసి తెర్లబెట్టి, తెర్లుతున్నప్పుడు

టమాటోపండ్ల ముక్కలు, కొంచెము యింగువపొడి, కొత్తిమెరాకు, కరివేపాకు వేసి కొంచెము వేపయిన తరువాత దించి తిరుగపోతపోసి భోజనంలో వాడినచో ముద్దపులుసు చాల రుచిగా నుండును.

క్యారెట్ దుంపల కోరును, పచ్చిమిరపకాయల ముక్కలను వడలపిండితోబాటు బాగా రుబ్బి చేసిన క్యారెట్ వడలు చాల రుచికరమైనవేకాక, బలవర్ధకమైనవి కూడాను.

క్యారెట్ ముక్కలను సొర, బీర, పొట్ల, బూడిదగుమ్మడి ముక్కలతోబాటు కూటు (పప్పుకూర) చేయనగును.

క్యారెట్ కోరును ఉప్పు, పచ్చిమిరపకాయ ముక్కలు వేసి మెత్తగా ఉడికించి, అందులో చిన్న చిన్న టమాటో ముక్కలను, కొబ్బెరకోరును కలిపి, పెరుగు పచ్చడి చేయనగును.

బహుళోపయోగమగు క్యారెట్ దుంపలు పుష్టికరము, ఆరోగ్యకరమగు ఉపాహారము.

చిపుకుల లక్ష్మీపున్నయ్య

---

ఒకటవ తరగతి చదువుకునే ఒక అమ్మాయి తల్లిని "అమ్మా! మా పుస్తకంలో గాంధీతాతవలెనే మనము నడచుకొనవలెను అని ఉంది. ఆయన కర్రపట్టుకొని నడిచేవాడట - అలాగే నడవాలా?" అని అడిగింది.

పెంకెపిల్లా! అది కాదే - ఆయన అడుగుజాడలనే మనము అనుసరించాలి.

"అంటే - ఆయన వెంట అడుగులేస్తూ నడవాలంటావు - అంతేనా!" అన్నది అమ్మాయి.

మరువాడ సూర్యప్రకాశం




## పాపాయి

శ్రీమతి మాడభూషి అలివేలమ్మగారు

పాపాయి బొమ్మకై పెట్టిందిపోరు ॥
బొమ్మయిస్తేగాని బువ్వతిననంది ॥

పాపాయి బొమ్మకై పెట్టిందిపోరు
బొమ్మ తెచ్చిస్తేను బువ్వతింటుంది ॥

పాపాయి పూలకై కలువరిస్తుంది
పూలు తెచ్చిస్తేను మురిసిపోతుంది ॥

పాపాయి కాఫీకై పంతమూనింది
కాఫీ తెచ్చిస్తేను కనులు మెరిసింది ॥
పాపాయి కీఫికై (టిఫిన్ కై) పలువరించింది
కీఫి తెచ్చిస్తేను చిరునవ్వునవ్వింది ॥
పాపాయి గౌనుకై ఏడ్వసాగింది
గౌను కుట్టిస్తేను తొడిగి కులికింది ॥

—— (०) ——

## మెదడుకు మేత?

1. నా వంశము వర్ధనవంశము. నా పేరులో సంతోషము తొణికిసలాడుతుంటుంది. మరి నేనెవరో చెప్పు చూద్దాం?

2. నేను తంజావూరులో బృహదీశ్వరాలయమును కట్టించాను. నా పేరేమిటి?

3. నేను సంస్కృతములో మహోత్కృష్టమైన మూడు నాటకాలు వ్రాసి శాశ్వత కీర్తి స్వార్జించాను. నా పేరో?

4. నేను సెల్యూకస్‌ను ఓడించాను. అయన కూతుర్ని పెళ్ళిచేసికున్న నేనెవర్ని?

5. నేను మహాబలిపురమును నిర్మించాను. పేరేమిటి?

### జవాబులు

1. హర్షవర్ధనుడు
2. రాజరాజ చోళుడు
3. కాళిదాసు
4. చంద్రగుప్తమౌర్యుడు
5. నరసింహవర్మ

I. S. R. S. V. అప్పారావు

# పట్టుదల

లిపొ అను నతడు టాంగ్ రాజవంశానికి చెందిన ఒక చైనీస్ మహా కవి (618-907). బాలుడుగా ఉన్నప్పుడు అతడు షుచ్ ఉవాన్ మండలంలో ఒక వీధి బడిలో చదువుకొంటుండేవాడు. చదువంటే అతనికి యెక్కువ శ్రద్ధ వుండేదికాదు. అందువల చదువు అబ్బేదికాదు.

ఒకనాడతడు బడినుండి పారిపోయి తూర్పుదిశగా వెళ్ళసాగాడు. నడుస్తూ అతడు యిలా అనుకొన్నాడు. "ఇక నేను బడికి పోనే పోను. రోజూ యిలా ఇష్టంవచ్చినట్టు తిరుగుతూ ఉంటే యెంత హాయిగా ఉంటుంది!"

అలా నడవగా నడవగా అతడు ఒక సెలయేటి దగ్గరికి వచ్చాడు. ఆ సెలయేటి దగ్గర ఒక ముసలమ్మ కనబడింది. ఆ ముసలమ్మ ఒక ఇనుప కడ్డీని రాతిమీద అరగదీస్తూ ఉన్నది. మాటిమాటికి రాతిమీద నీళ్లు జల్లుతూ ఆ ముసలమ్మ విసుగులేకుండా ఇనుప కడ్డీని అలానే అరగదీస్తూ పోతున్నది.

ఆమె చేస్తున్న వింత పనిని చూచి లిపొ ఆశ్చర్యపడి ఇలా అడిగాడు. "అమ్మమ్మా యేంచేస్తున్నావు?"

"గుడ్డలు కుట్టుకొను సూదిని తయారు చేస్తున్నాను."

ఆ ముసలమ్మ లిపొ వైపు ఒకసారి చూచి మళ్ళీ తన పనిలో నిమగ్నురాలై పోయింది.

తల ముగ్గుబుట్టలాగ పండిపోయి, ముఖమంతా ముడుతలు బడిపోయినా చురుకుగా అలా పనచేస్తున్న ఆ ముసలమ్మను చూస్తూ లిపొ "కాని అది సాధ్యమేనా?" అని తన అనుమానాన్ని వెళ్ళబుచ్చాడు.

"ఎందుకు సాధ్యంకాదు? ఇవ్వాళ తయారు కాకపోతే రేపుగూడా యిలానే అరగదీస్తాను. అప్పటికీ కాకపోతే ఆ మర్నాడు గూడా యిలానే అరగదీస్తాను. ఇలా అరగదీస్తూ పోతుంటే అది యేనాటికో ఒకనాటికి సూదిగా తయారవుతుంది." అని ఆ ముసలమ్మ సమాధానం చెప్పింది.

ఈ మాటలు విన్న లిపొ తనుగురించీ. తన చదువును గురించీ ఆలోచించ సాగాడు. "నా చదువు విషయంలో గూడా యిది వాస్తవమే, పట్టుదలతో చదివినట్లయితే అది యెందుకబ్బదు?" అనుకొన్నాడతడు. వెంటనే అతడు పట్టుదలతో చదువుకోడానికి నిశ్చయించుకొని వెనుదిరిగి బడికి వెళ్ళిపోయాడు. అలానే పట్టుదలతో చదువుకొని అతడు చైనాదేశపు మహాకవుల్లో ఒకడయ్యాడు.

—(౦)—

రైలు కదలబోతున్న సమయంలో ప్రయాణీకుడు హడావుడిగా ఒక పెట్టెలో ఎక్కుతూ "బాబూ! మీకు పుణ్యముంటుంది! కొంచెము జాగా యివ్వండి - బండి కదులుతుందేమో!" అని కిటకిటలాడుతున్న జనాన్ని ప్రాధేయపడ్డాడు.

దర్జాగా పక్కపరచుకొని కూర్చొనియున్న ఒక మహారాజు "లేదు లేదు - ఖాళీలేదు! మరొక పెట్టెను చూచుకో!"

"బాబూ! నేను మరొకపెట్టె చూచుకుంటాను - మా అన్నయ్యను యిక్కడ ఎక్కనీయండి" అన్నాడు ప్రయాణీకుడు.

బొడ్డుపల్లి కృష్ణావధాని

# పాపం బ్రద్దలైంది

'రాఘవ'

(గతసంచిక తరువాయి)

"ఇంతవరకూ యింకా వంటేకాకపోతే, యింకెప్పుడు మేం తిన్లుతినేది?" కోపంతో పాన్ని దిగమ్రింగుకొంటూ అడిగాడు. ఆమె ముఖం చూసేసరికి భయం వేసింది.

"ఏం అంత తొందర వండేదాకా ఆగలేరా?" కనుబొమలు ముడివేసింది.

"ఇంకా యెప్పుడే! రెండు ఝాములకా?"

"ఉన్నవాళ్లు యింత వరకూ యెలాగో వున్నారుగా! కాస్తాగండి. వండి వారుస్తాను. తొందర పెడితే ఎట్లా? చేయద్దూ!"

"మరీ నీకు రానురాను చాదస్తం ఎక్కువైంది లెద్దూ!"

"అంత ఆగలేనివాళ్లు, జయలక్ష్మితో చిన్న పొయ్యి మీదవుడకేయించుకోలేకపోయారా! ఏకంగా మైలకూడే తినేవాళ్ళు"

"నీ మడికూడు తిని చచ్చేబదులు - ఆ మైలకూడు తినటమే మేలు."

"ఏరోయి! మాటలు తిన్నగారానీ! అంత చస్తున్నారా! యివాళంటే శ్రాద్దెక్కిందిగానీ, రోజు యీ మాదిరిగానే అవుతోందా?"

"ఆఁ...ఖచ్చితంగానూ! మీరూ మీరూ దెబ్బలాడుకుని అనవసరంగా మా పొట్టలు మాడుస్తున్నారు." కాస్త ధైర్యంతో అనటం ప్రారంభించాడు. జయలక్ష్మికీ, జగన్నాధంకి తల్లీ కొడుకుల సంభాషణ వినిపిస్తునేవుంది. 'అలా గట్టిగా నువ్వన్నా నిగ్గతీసి అడుగూ' అని జగన్నాధం మనసులో హెచ్చరికచేసినట్లుగా అనుకున్నాడు. గట్టిగా అంటే, భార్య ఎక్కడ వినిపోతుందో నన్నభయంతో మెల్లిగా అనుకున్నాడు తనలో తాను. "ఒకవేళ విన్నదో, మీరే రెచ్చగొట్టి, నామీదకి జగడానికి పంపారు. నాకూ-వాడికి తగూపెట్టి, దిక్కులేని పక్షిగా చేద్దామని పన్నాగం పన్నారు" అని ఎక్కడనిపోతుందోనని శంకించి వూరుకున్నాడు.

"తనదాకా వస్తేగానీ, యితరుల కష్టాలూ-బాధలూ తెలియవన్న" సామెత నిజమే అనుకొని, భర్త అడిగేవాటిని, అత్తగారనే మాటల్ని వింటూ శోషిల్లి పడుకొనివుంది జయలక్ష్మి.

ఆ మాటకామాట పెరిగి పెరిగి, చివరకు తల్లీ కొడుకుల మధ్యా పెద్ద రగడజరిగింది. "నీ మూలానే యిదంతా జరిగిందని"-దుర్గమ్మ ధర్మారావుని యీసడించింది.

"నా సంసార జీవితం నాకిట్లా దుర్భరంకావటం నీవల్లనే! నీ మూలాన నాకు మనశ్శాంతిలేకుండాపోయింది. యిల్లు యమకూపంకన్నా హీనంగా తయారైంది. నా భార్యను నిర్దాక్షిణ్యంగా రాచి రంపాన పెడుతున్నావ్. మడి-మడి అని మా ప్రాణాలు నిలువునా తోడుకుతింటున్నావు. యేమిటిదంతా? నీ మూలానగాదూ!" _ యెలాగో అడగదల్చుకున్న నాలుగు మాటలూ, దుర్గమ్మగొంతుక్కితావు యివ్వకుండా బిగ్గరగా గబగబా అనేశాడు. ఇలా అడగటం చూస్తూ వినేసరికి జగన్నాధానికి కొంత వుత్సాహం వచ్చింది. శోషిల్లి పడుకున్న జయలక్ష్మికి క్రొత్తశక్తి యేదో శరీరంలో ప్రవేశించినట్లయింది. తన తరఫున తన భర్త-ధర్మారావు యిట్లా అడుగుతాడని కలలో

కూడా తలపోయలేదు. తనంటే ఆయనకు మనస్ఫూర్తిగా యిష్టమున్నదని గ్రహించింది. తను అనుకున్నంత అసమర్థుడు కాదని తేలిపోయింది. ఆ రోజున భోజనాలయ్యేసరికి రెండు గంటలు దాటినయి. ఆకలి తీరటమనేది యెలావున్నప్పటికీ, ఆయాసం ఒడలిక ఎక్కువైనయి. కాలి కాలి వున్న కడుపులో ఒక్కసారిగా వేడివేడి అన్నం పడేసరికి, నిస్సత్తువగా వున్న నరాలన్నీ ఒక్కుమ్మడిగా సళ్ళిచ్చాయి. మంచినీళ్ళబోత అధికమైంది. తిండి తింటం తక్కువైంది. ఆనాటినుంచీ, దుర్గమ్మ వంటయింటికి స్వస్తి చెప్పింది. యిష్టముంటే - అదైనా ఓపికనిబట్టి- తోచినపని చేస్తానంది. మిగతా యింటెడుచాకిరీ జయలక్ష్మి భుజస్కంధాలపై బడింది. జయలక్ష్మి వెఱగందలేదు. యిదంతా తన మంచికే ననుకొంది. మితభాషణ మొదలైంది. అవుసరముంటే, అచ్చటా ముచ్చటా ప్రస్తావించుకోటం - లేకపోతే ఎవరిదోవ వాళ్ళదన్నట్లు ప్రవర్తించ సాగారు. అయినా, ధర్మారావు మనస్సుకి శాంతిచేకూరలేదు. అందువల్ల చేస్తూ చేస్తూ వున్న మునసబుగిరీకి, తండ్రిలాగే రాజీనామా యిచ్చి వూరుకున్నాడు. జగన్నాధం ఏ అభ్యంతరమూ పెట్టలేదు. "యిష్టంలేనప్పుడు తనెందుకు పట్టుబట్టి చేయమని బ్రతిమిలాడటం" అని వూరుకొన్నాడు. వారసత్వప్రకారం ఆ మునసబు గిరిని, జగన్నాధం, తమ్ముడైన నారాయణరావు కిప్పించాడు. అప్పట్లో అతడు స్కూలుఫయినల్ పూర్తి చేసి వుద్యోగం కోసం అన్వేషిస్తున్నాడు. అన్నగారి యందు అమితమైన గౌరవం కలవాడు కాబట్టి, కాదనటానికి నాలుకాడక, ఒప్పచెప్పిన మునసబు గిరిని స్వీకరించాడు.

అప్పటికి మృగశిర కార్తె సగంకూడా జరగలేదు. తొలకరి మబ్బులతో వుండీ వుడిగీ వర్షాలు పడుతున్నయి. ఉరుముల మెరుపులతో ఆకాశం బ్రద్దలైపోతోంది. రైతులు వ్యవసాయం పనులమీద ఒత్తిడిగా తిరుగుతున్నారు. నాగళ్ళు భూమిని దున్నుతున్నయి. ధర్మారావుకి కూడా వ్యవసాయం చేయాలనిపించింది. వూరికేవుండి చేయవలసినదేమీ కనిపించలేదు. తండ్రితో సంప్రదించాడు. అయితే జగన్నాధం పేరిటవున్న పొలం ఆ వూరికి పదిపన్నెండు మైళ్ళదూరంలోవున్న మరో వూళ్ళోవుంది. అక్కడే దగ్గర్లోవుంటే, సొంత వ్యవసాయం సులువుగానూ సక్రమంగానూ నడుస్తుందని ఆశించి తరలి వచ్చేసారు యావత్ కుటుంబమున్నూ. ఆ సమయంలో నారాయణరావు చాలా దిగులుపడ్డాడు. యింతవరకు తనకు అండగావుంటున్న అన్నగారు వెళ్ళిపోవటం బాధ కలిగి - విచారంగా తోచింది. ఆనాటినుంచి, నారాయణ సంసారం వేరైంది. జగన్నాధం సంసారం యిక్కడకొచ్చేసింది. నారాయణరావు శారదతో కాలక్షేపం చేస్తున్నాడు. జగన్నాధంకి మాత్రం తమ్ముణ్ణి చూడకుండటమనేది భరించలేకపోయాడు.

తండ్రి మరణానంతరం ఉన్న స్థిరాస్తిని పంచుకోగా, జగన్నాధంకి వోఆయిదెకరాలూ - నారాయణరావుకి వోఆయిదెకరాలు సమానంగా సంప్రాప్తించింది. ఉన్న పూర్వకాలపు యింటిని చెరిసగం పంచుకున్నారు. యింట్లోవున్న పాత్రసామాగ్రిని, వస్తువాహనాల్నికూడా, యే మనస్పర్ధా - ఏ కీచులాటలు లేకుండానే, న్యాయబద్ధంగా తీసుకున్నారు. ధర్మారావు మునసబుగిరికి స్వస్తిచెప్పిన మరుక్షణంలోనే, జగన్నాధం తనవాటాకొచ్చిన యింటికి బేరం పెట్టాడు. యీ సంగతి తెలిసి నారాయణరావు ఆ వాటాని అమ్మవద్దని చెప్పాడు. దుర్గమ్మకి కోపం వచ్చింది.

"మావాటా మేమమ్ముకొంటే నీకేం నష్టం?" అని మరిదిని ముఖానే అడిగివేసింది. 'యీవిడెప్పుడూ యింతేలే' అని నారాయణరావు సరాసరి అన్నగారివద్దకుపోయి, "నువ్వనవుసరంగా నీ వాటా యింటిని అమ్మకోవటం దేనికన్నయ్యా! తరతరాలనుంచీ మన కచ్చివస్తున్న యీ గడ్డనమ్మకోవటం మర్యాదైనపనిగాదు. నా మాట కాస్త చెవిని బెట్టుకో అన్నయ్యా!" - అని ఒకనాడు ప్రాధేయపూర్వకంగా చెప్పాడు. జగన్నాధంకి, తమ్ముడి మాటలు నిజమని తెలుసు. కాని యింట్లో పోరు యింతింతకాదుగా.

"మనవారి మనం మాటామల్లే చంకనెట్టుకొని పోతుంటే, యింకా యిక్కడ కొంపదేనికి? ఎవరంటారు? పోనీ అద్దెకిద్దామంటే పల్లెటూరై పోయింది. ఎవరువుండేది? వెళ్లేచోటులో వుండటానికి అద్దెకొంప తీసుకొంటామా! అందుకని యీ వాటా అమ్మేసి, ఏకంగా ఒక యిల్లే కొనుక్కొని వుండటం ఎంతైనా మంచిది" - దుర్గమ్మ ధర్మారావు యీ మాటలు నిత్యము అంటూ వుండటంచేత, చెవులు చిల్లులుపడిపోయి, జగన్నాథం తన వాటాకి బేరం పెట్టాడు. పరాయివాడుకొనటం నారాయణరావుకి యిష్టంలేదు. అందుకని, ఒకనాటి సాయంత్రం అన్నగారితో రహస్య సమాలోచన చేస్తూ—

"నువ్వు యెలాగు నీ వాటా నమ్ముకోదల్చావు కాబట్టి, నేనే కొంటాను. పరాయివాళ్లకమ్ముతున్న దగ్గర్నుంచి, నేను బ్రతికివున్నంతకాలము, వాళ్ళ పొరుగున కాపురం చేయాల్సొస్తుంది. నిన్న మొన్నటి వరకు నువ్వు కాపురంచేసిన యింట్లో మరో పరాయి వ్యక్తులొచ్చి పొయ్యి రాజేయటం నేను చూస్తూ వూరుకోలేని సంగతి. అది ఒక విధంగా నాకు న్యూనతగాకూడా వుంటుంది. మనిద్దరం ఎంతవేర్లు పడినా, లోకం దృష్టిలో రక్తస్పర్శకలవాళ్ల మేగదా! సహిస్తూ బ్రతకగలనా! కావున నేనే కొంటాను, బేరంతేల్చిచెప్పు"మన్నాడు. జగన్నాథం కాస్సేపు దీర్ఘాలోచనచేసాడు. నిజమే! పరాయివాడి కమ్ముకునే బదులు, తన తమ్ముడికే ఏదో ఒక ధరకు అమ్ముకోవచ్చునుగా! అయిన వాడికన్నా, కాని వాడి గొప్పేమిటి? యిక యీ విషయాన్ని సాగదీయకుండా జగన్నాథం, పదిహేనువందల రూపాయలకు, నారాయణరావుకి మాటిచ్చేశాడు. ఆ మర్నాడే రిజిష్టరుకూడా పూర్తయింది. అమ్ముతున్న తన వాటావంక చూస్తూ, తమ్ముడివద్ద స్వహస్తాలతో కోరిన పైకం పుచ్చుకొంటుంటే, జగన్నాథం కళ్లు చెమ్మగిల్లినయి. హృదయం బెంగతో మరిగిపోయింది. తన జీవితంలో యింతటి ఘనకార్యం చేతులారా తలపెట్టాల్సి వస్తుందని ఎన్నడూ వూహించనైనాలేదు. పైకం అందుకొని, ఆ యింటి ఆవరణ దాటిరావడానికి, జగన్నాథం కాళ్లు తడబడినయి. వెడుతూకూడా, యింటిని పదేపదే కలయచూసుకోవటం మానుకోలేకపోయాడు. చేతులారా చిన్నప్పటి నుంచి పెంచిన కొబ్బరిచెట్లను వదిలివెళ్ళబుద్ధికాలేదు. తమ్ముణ్ణిపిల్చి, గాద్గదిక స్వరంతో - "మరి యిక నేను వెళ్ళొస్తాను, యింటిని జాగ్రత్తగా కనిపెట్టుకొని చూసుకో" - అన్నాడు. కంఠం పూర్తిగా రుద్ధమైంది. హృదయం మమకార పూరితమైన ఆవేదనతో కలతపడసాగింది. 'తన' అనే భావాన్ని మర్చిపోవటం, ఆ సమయంలో చాలా కష్టతరమనిపించింది. జీవితంలో యింతటి అనిర్వచనీయమైనభావన మరేదిలేదని రూఢిచేసుకొన్నాడు. "అయితేనేం, తమ్ముడిఆస్తి" - అనే మరో అభిప్రాయం అతణ్ణి కొంచెం తేరుకునేలాగుచేసింది. నారాయణరావు కూడా, అన్నగార్ని ఓదారుస్తూ సాగనంపాడు.

తీరా యింటికి వెళ్లటం జరిగిన పిదప, దుర్గమ్మ విరుచుకుపడింది. అప్పటికే వూరునాడు ఏకమైపోయింది. జగన్నాథం యెంతో తెలివి తక్కువగా యిల్లమ్ముకొన్నాడని. నారాయణరావు అన్నగార్ని యుక్తితో లోబరుచుకొని, తక్కువ ధరకే యిల్లు కొన్నాడని. ధర్మారావుకి నఖశిఖ పర్యంతం శివమెత్తింది.

"తమ్ముడుగదా తక్కువ ధర కిచ్చుకొని, బంగారమంటి యిల్లుని అమ్మివేశారు-మరే యితరులకమ్మితే, నిక్షేపంలాగా రెండువేలు వచ్చేవి. అన్నిందాల మీవల్ల కొంపకూడాలేకుండా చేసుకోవాల్సొచ్చింది. ఆయనతప్పు, కొనేనాథుడే లేకపోయాడా? మీరమ్మినందుకే చెప్పుకోవాలి, యిలా చేయబట్టిగాదు యీ సంసారానికి యీ దురవస్థ వచ్చిపడింది" - దుర్గమ్మ నాలిక ఆ పూటల్లా మడతపడ నేలేదు. ధర్మారావు పళ్లు పటపట కొరుక్కున్నాడేగాని, తెగించి తండ్రిచేసిన పనిని విమర్శించలేకపోయాడు. యీ విషయంలోనే దుర్గమ్మ - ధర్మారావు తిరిగి అభాలోచితంగా ఏకమైపోయారు. ఆ నాటినుంచి మామగారు కోడలు ఒకటైనారు. తల్లికొడుకు ఒకటైనారు.

నారాయణరావు, శారదతో నిక్షేపంగా సంసారం చేస్తూ - నిరాఘాటంగా మునసబుగిరినికూడా చేస్తున్నాడు. అంత పెద్దింట్లో బిక్కుబిక్కుమంటూ, పిల్లా జెల్లా లేకుండా, కేవలం నారాయణరావు దంపతులే, కాలక్షేపంచేయటం ఒక విధంగా భయంగానే వుంది. ఎవరికైనా అద్దెకిద్దామా అని ఆలోచించాడు. వచ్చి జగన్నాథం వాటాలో దీపం వెలిగించేదిక్కు కనిపించలేదు. తాళంవేసి కొన్నాళ్లు వుంచాడు. అయిదెకరాల్ని కవులికిచ్చి, పరువు ప్రతిష్ఠలతో కాపురంచేస్తున్నాడు. అప్పటికి శారద కాపరానికొచ్చి రెండు సంవత్సరాలు గడచినయి. అల్లారుముద్దుగా చూసుకోవటానికి, ఏ వొక్క నలుసూ పుట్టలేదు. అప్పట్లో ఆ భార్యాభర్తలకి తీరనిలోటు సంతానం కల్గలేదే! అన్నదొక్కటే, మిగతా పరిస్థితులన్నీ సక్రమంగానే వున్నయి. రోజులు ఆనందంగా గడిచిపోతున్నయి.

ఇలా వుంటూ వుండగా శారద తరఫు బంధువుల్లో జీవనోపాధి దొరక్క, ఎక్కడైనా పదిమంది పిల్లలికి ప్రయివేట్లు చెప్పుకొని బ్రతుకుదామని వచ్చిన వీరభద్రం ఆ వూరొచ్చి నారాయణరావుని ఆశ్రయించాడు. భార్యతరఫు బంధువని మర్యాదచేసి, తనింట్లో ఆశ్రయమిచ్చి, ఆదరాభిమానాలతో చూడసాగాడు. వీరభద్రం, శారదకు వేలువిడిచిన మేనత్తకొడుకు. స్కూలు ఫైనల్ వరకు చదివాడు. ఉద్యోగం కోసం నానాశ్రమలు పడ్డాడు. తండ్రినాటి కొద్దిపాటి ఆస్తిని తెగనమ్మి చదువుకోసం ఖర్చుచేశాడు. తల్లి చిన్నప్పుడేపోయింది. తండ్రి పక్షవాతంతో తీసుకు, తీసుకొని చనిపోయాడు. 'నా' అనేవాళ్లు కన్నెత్తిచూసి, నోరు కదిపి బ్రతుకు తెరువు చూపించలేకపోయారు. అతనిలో అతనికే నిర్జీవంగా బ్రతకట అసహ్యమనిపించింది. పెళ్ళిచేసుకొని సుఖపడదామనే ఆశ చివురెత్తినప్పుడల్లా, తన దురదృష్టం గుర్తొస్తూండేది. అయినవాళ్లెవ్వరు సాహసించి వీరభద్రంకి పెళ్ళిచేయలేకపోయారు. తోడబుట్టినవాళ్లు లేకపోయారు. ఏకాకి. బ్రతుకుదామని ఆశవుంది. మార్గం కనిపించేదిగాదు. వీరభద్రంకి దాదాపు పాతికేళ్లుపైచీలుకొచ్చి వుంటయి. చిన్న కళ్ళు, తేనెకళ్ళులాగా వుంటయి. సన్నగా జెండాకర్రలాగా వుంటాడు. చెప్పిన విషయం చెప్పకుండా చెప్పుకొస్తాడు. యీ రకమైన అలవాటు అనేక ప్రదేశాలు తిరగటంలోను - అనేకమంది రకరకాలైన మనుష్యులతోను మాట్లాడటంవల్లను అలవడింది. తన పని గడుపుకొనిపోవటంలో ఎంత నేర్పు చూపించాలో అంతా ప్రదర్శించగలడు. అందితే జుట్టు - అందకపోతే కాళ్ళు పట్టుకోగల్గే ప్రజ్ఞ వుంది. ఏయెండకాగొడుగు పడతాడు. తన అవుసరం తీరేంతవరకు జలగలాగాపట్టి, నరనరాల్లోని రక్తం పీల్చేస్తాడు, వూరికే, పనివున్నా లేకపోయినా. రెండుపూట్లా కాఫీత్రాగుతాడు. తన అనుభవాలన్నీ ఏకరువుబెట్టి ఎదుటివార్ని లోబరుచుకొంటాడు. తిన్న యింటి వాసాలు లెక్కపెట్టేరకం. మంచి మర్యాదలిచ్చి గౌరవం చూపటం జరిగిందో నెత్తికెక్కి పిండికొడతాడు. మానవుడు స్వార్థపరుడని మానవుడికే తెలుసు. అలాంటివాళ్ళలో యీ వీరభద్రం ఒకడు. తన కడుపునిండి, కాలంసుఖంగా గడిస్తేచాలు. ఎదుటివ్యక్తి యేమైపోయిన పట్టించుకోడు. యిలాంటి దుర్మార్గలక్షణాలన్నీ తనలో వున్నయ్యని తెలిస్తే ఎవ్వరు తనని దరిజేర్చుకోరని యోంచి, ఎంతో పెద్దమనిషిలాగాను - మితభాషిగాను - నటిస్తాడు. యిటువంటి వ్యక్తులు లోకంలో సహజంగా, నగ్నసత్యానికి దూరమవుతున్నకొద్దీ నటుడికన్నా మిన్నగా నటించుతు వుంటారు. వాళ్ళకి నటన జీవితంలో కొన్ని మధురఘడియల్నిగూడ రుచి చూపుతుంది, అందుకే వీరభద్రం, ఎన్నో ఆశలు పెట్టుకొని మరీ వచ్చాడు నారాయణరావు యింటికి.

నారాయణరావు వస్తుతహా మొగమాటపు మనిషి. 'నీతో యీ పని కానున్నది' అని మంకుపట్టుదల పడితేచాలు, నిజంగా తనవల్లే అవుతుందని భావించే మనస్తత్వంగలవాడు. ఎవరిమాటా కాదనలేదు. తన కున్న శక్తి సామర్థ్యాలకొద్దీ యెవరికెంత ప్రాప్తో

అంత సహాయము - సహకారము చేసితీరుతాడు... గ్రామంలో నారాయణరావంటే పలుకుబడే కేవలం కాకుండా, ఆత్మీయతకూడా తగుపాళ్లుగా వుంది.

ఒకవారం రోజులు గడిచాక, వీరభద్రం ఆ మాట-యీ మాట చెప్పుకొంటూ, తన వుద్దేశ్యాన్ని వ్యక్త పర్చాడు. నారాయణరావు ఆలోచించి, చేద్దామని మాటిచ్చాడు. యీ వారం రోజుల్లోను, వీరభద్రం ఆ యింటి నైసర్గిక స్వరూపాన్ని, వాతావరణాన్ని అవలీలగా అర్థంచేసుకొన్నాడు. శారద పుణ్యమా యని వీరభద్రం యేలోటులేకుండా కడుపునిండా మెక్కుతున్నాడు. నారాయణరావు పనుండి గ్రామంలోకి కదిలివెళ్ళినప్పుడల్లా తను వెంటవెళ్ళి, పరిసరవాతావరణాన్ని చూసి తన్మయపడేవాడు. శారదకూడ, ఎంత వేలువిడిచిన మేనత్తకొడుకైన, లోటుకల్పించకుండా, వీరభద్రానికి అన్ని సౌకర్యాలు కల్పిస్తోంది. వీరభద్రం, తన బ్రతుక్కి రాచరికం అబ్బిందని కలగన్నాడు. బీడీలు కాల్చే వీరభద్రం, నారాయణరావు కోరికపై సిగరెట్లు కాల్చటం మొదలెట్టాడు. ...

ఎలాగైతేనేం, నారాయణరావు వీరభద్రంచేత ఒక ప్రయివేటుస్కూలు తను కొన్న అన్నగారి వాటాయింట్లో పెట్టించాడు. నారాయణరావు మాట తీసెయ్యలేక, ఆ వూరిపిల్లలు ప్రయివేటు చదువుకి చేరారు. అంతాగూడి ఒక పదిహేనుమంది వుంటారు. జగన్నాథం అమ్మిన వాటాకి, నారాయణరావు వాటాకి, మొదట్లో యే అడ్డుగోడగానీ, యే తడికగానీ లేనేలేవు. యిద్దరన్నదమ్ములు వాటాలుపడిన పిమ్మట మధ్యపేడబూసిన, వెదురు తడికెలు పెట్టుకున్నారు. అప్పట్నించి వీరభద్రం బడిపెట్టేంత వరకూ, ఆనాటి మేదరతడికెలు అలాగే, పేడపూత రాలివున్నయి. స్కూలుప్రారంభించిన మరునాటి నుంచీ వీరభద్రంకి పడుకోడానికి ఒక మంచం, ఒక పరుపు రెండు తలదిండ్లూ, ఒక దుప్పటి, యింకా కొంత ముఖ్యసామాగ్రి నారాయణరావు యిచ్చాడు.

వేరేవంట పెట్టుకుందామనుకుంటుండగా, వీరభద్రాన్ని సమాధానపరుస్తూ నాతోపాటు నువ్వూ మా యింట్లోనే భోంచెయ్యమని కోరాడు నారాయణరావు. శారదకూడా, ఎంతో ఆప్యాయితగా— "అదేమిటి బావా! నేనుండగా నీకీ అవస్థ దేనికి? ఆయనతోపాటు నువ్వూ వేళకింత ఎంగిలి పడితే పోయేదానికి అస్తమానము ఆ పిల్లలతో వాగివాగి, వంట చేసుకోవటం కష్టంగాదూ! నువ్వేం అనుకోకు, యిక్కడే భోంచేద్దువుగాని" అంది. వీరభద్రం యిక యేమంటానికి తోచక, తలూపాడు. తన బ్రతుకిట్లా పండుతుందని, కాఫీలు త్రాగుతూ, కడుపునింపుకొని బిక్కాఫకీరులాగా జీవితం గడిపే వీరభత్రం యేనాడైనా అనుకున్నాడా? అదృష్టం కలిసిరావటమంటే యిట్లాగే వుంటుందని భావించాడు. "తనని ఎవ్వరూ నమ్మరు" అని అపోహపడినందుకు, నారాయణరావు దంపతులు మనస్ఫూర్తిగా నమ్మినందుకు, ఎంతో ఆశ్చర్యపడ్డాడు.

నారాయణరావుతోపాటు, శారద వీరభద్రంకి రెండు పూటలా లోటులేకుండా భోజనం పెడుతోంది. ప్రొద్దునా, సాయంత్రం కాఫీలు కాచి యిస్తోంది. ఆడపా తడపా చేసుకొన్ననాడు ఫలహారం కూడా పెడుతోంది. యిక వీరభద్రంకి కష్టాలెందుకు గుర్తుకొస్తయి? బాధలెందుకు తారసిల్లుతయి? దిగులెందుకుంటుంది? దర్జాగా. పోగైన ఆ పదిహేను మందికి డొక్క శుద్ధిచేయటం సాగించాడు. పగలల్లా పిల్లకాయల చదువులతో యింటిపై పెంకులు లేచిపోతున్నయి. పాఠాలు వొప్పచెప్పనివాళ్ళ వీపులు, వీరభద్రం చేతిలోవున్న యీతబెత్తంతో తాటలేచి, తుప్పురాలిపోతున్నది. ఏనాడు పిల్లలకి చదువు చెప్పటం చేతకాకపోవటంతో, వీరభద్రంకి యిట్టె కోపమొస్తూవుండేది. అక్కడికీ తమాయించుకునేవాడు. లేకపోతే, చటుక్కున పిల్లలు చదువుమానేస్తారేమోననీ, వచ్చేరాబడి పోతుందేమోనని భయపడేవాడు.

వీరభద్రం యెంత నక్కజిత్తుల మారివాడయినప్పటికీ, అతని కంఠం నాటకాల సంగీతంతో బాగా

తర్ఫీదుపొంది పోయింది. తీరిక దొరికినప్పుడల్లా యే పాండవోద్యోగవిజయాల్లో పద్యాల్నో - లేకపోతే మరేయితర హరిశ్చంద్రలోవో కురుక్షేత్రంలోవో కంఠమెత్తి రాగయుక్తంగా పాడుతూండేవాడు. దీన్ని బట్టి నారాయణరావు దంపతులతోబాటు ఆ చుట్టుప్రక్కల ప్రజానీకం కూడా "యీ పంతులు పద్యాల్నెంత బాగా పాడతాడు." అనుకోవడం కోసం, నామోషీ లేకుండా పాడేవాడు. వీరభద్రం ఆశించినట్లే, ఆ వూరు యావత్తూ, అతన్ని ఒక గొప్పనాటకాల పాటకుడిగానే మెచ్చుకొని చెప్పుకొంది. శారదకి కూడా, వీరభద్రం సంగీతం నచ్చింది. యింతవరకూ యే కలతలూ లేకుండానే వీరభద్రం జీవితాన్ని గడుపుతున్నాడు. నారాయణరావు దంపతుల పుణ్యమా అని కడుపు నిండుతోంది. నెల తిరక్కమునుపే, పిల్లలద్వారావచ్చిన యాభైరూపాయిలు, చల్లగా జేబులో దాచుకొన్నాడు. మాటవరుసకి మాత్రం శారదతోను నారాయణరావుతోను అన్నాడు గొంతుక పెద్దదిచేసి పాఠాలు చెప్పటంతో, 'బాగా చెపుతున్నార'ని, మరికొంతమంది పిల్లలు రెండో నెలలో చేరారు. రోజులు గడుస్తున్నాయి.

## 8

శారద మధ్యరకం కుటుంబంలో జన్మించినప్పటికీ సంసారపక్షంగా జీవితాన్ని వెళ్ళమార్చటానికి తగిన స్త్రీ. తనుమాత్రం రూపసి. చామనచాయగా వుంటుంది. విశాలమైనకళ్లు. అమాయకత, నిర్మలత్వం ఆ కళ్ళల్లో దాగొని వున్నయి. కలుపుగోలుతనంగా మాట్లాడే వ్యక్తిత్వం. క్రొత్తవిషయాల్ని, సరిక్రొత్త అభిరుచుల్ని తెలుసుకొని తృప్తిపడే మనస్తత్వం. చదువూ - సంస్కారంలో పెద్దగా ఆరితేరిన మనిషికాదు. పుట్టింటివద్ద నేర్చుకున్న పనిపాటలవల్లనే, నారాయణరావుతో సంసారం నిరాక్షేపణీయంగా చేస్తూ వుంది. వివాహం కాకముందు ఎన్నో కట్టుబాట్లతో కాలంగడిచింది, అలా గడుపబట్టే, తానీరోజున నారాయణరావుతో సుఖంగా కాపురం చేయగల్గుతున్నానని విశ్వసించింది. అయితే సంతానం లేకపోవటంతో ఏదో అనిర్వాచ్యమైన దిగులు పదే పదే కలకవేస్తూండేది. భర్తవల్ల యే లోపమూ కలగటం లేదని మనస్ఫూర్తిగా తెలుసు. అయినా, తన కడుపు పండటంలేదు. కారణం ఏమిటో అర్థంకావటంలేదు. ఎవరివల్ల యీ లోటు కల్గుతోందో ఎవరు తెల్పకల్గేది? తన సంసారంగూర్చి సలహాలివ్వడానికి ఎవరికేంపని? లోకం హర్షించదూ! కాకిమూకగోల చేయదూ! శారద పరిపరివిధాలుగా తలపోసుకునేది. ఇక జీవితంలో పిల్లాజెల్లాకల్గరేమో! నని సందేహిస్తూ వుండేది. తనకింత యిల్లువుండీ, ఎంతో పరువు ప్రతిష్టలు గల్గినభర్తవుండీ, కూడా కలకలలాడుతూ పిల్లలు లేకపోయేసరికి శారద, తన ఒంటరిపాటుకి వ్యాకులపాటు చెందేది. పెట్టుకున్న ఎక్కడి వస్తువులు అక్కడే చెల్లాచెదురు కాకుండా వుంటూవుండేవి. నిజంగా పదిమంది పిల్లలుంటే, ఆ వస్తువులట్లావుంటయ్యా! ఏదో ఒకటి పగులకొడుతూనో, విరగ్గొట్టుతూనో, చింపుతోనో, వుంటారు. "ఊరుకోండర్రా" అని ఎన్ని కేకలేసినా వాళ్ళూరుకోరు. కొడితే భావురుమని ఏడుస్తారు. పసిహృదయాలు తీరా కొంతసేపటికి వాళ్ళమీదే జాలికల్గుతుంది. ఎత్తుకొని తిప్పుతూ సముదాయించాల్సొస్తుంది. ఏది కావాలని మారాంచేస్తే, అదల్లా తెచ్చియివ్వాలనిపిస్తుంది. చిట్టిచిట్టి పెదవులతో బుల్లిబుల్లి మాటలతో యేదో మూగభావ మాట్లాడుతారు. మృదువైన చేతుల్ని చాస్తూ ఏమిటో కోరుతారు. తెచ్చి యివ్వకపోతే, నేలమీదపడి శోకనాలు పెడుతూ దొర్లుతారు. కట్టుకున్నబట్టలు దుమ్ముకొట్టుకొనిపోతయి. తలచెరిగి, చీకేసిన తాటికాయల్లాగా వుంటయి. కళ్లు ఏడుపులతో కందిపోతయి.

(సశేషము)

# శ్రీ రా మ క ర్ణా మృ త ము

(ఆంధ్రానువాదము)

తృతీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౮

రమ్యగుణోపేత! రమణీయరూప! వి
  శ్వస్తోత్రపాత్ర! సుస్వస్తి నీకు!
రాకాశశాంక శుభ్రాస్య! రమాకుచ
  న్యస్త హస్త కమల! స్వస్తి నీకు!
రాజార్చిత చరణ రాజీవయుగళ! ప్ర
  శస్త దివ్యశరీర! స్వస్తి నీకు!
రాకేందుప్రతిమ! ఇందీవరాక్ష! ప్రభూ!
  సత్యదయాసింధు! స్వస్తి నీకు!
రాజ రాజులలోన, విరాజమాన!
స్వర్భువన మర్త్యపాతాళవాసి! స్వస్తి
నీకు! సద్భక్తి సేవింతు నిగమవినుత!
స్వస్తిఁ జేకూర్పుమయ్య! ప్రశస్తచరిత!

౯

పతితపావనుఁడ! విశ్వామిత్ర గౌతమ
  ప్రియుఁడవై, శ్రీరామ వెలసినావు
వనవాస మొనరించి, దనుజుల సమయించి
  విఘ్నముల్ హరియించి వెలసినావు
గుణముల కిక్కయై - కోదండధారివై
  సీతా సమేతుఁడై చెలఁగినావు
రావణ కుంభకర్ణాదుల, ధిక్కార
  మొనరించి, యా విభీషణుఁడు నిన్నుఁ
జేర, రక్షించినావు; లక్ష్మి వినోద!
లక్ష్మణుండు, సుగ్రీవుండు లలితభక్తి
నిన్ను సేవింత్రు; భక్తులు నిన్నుఁ జింత
నం బొనర్త్రు; రక్షింపుమా-నాగశయన!

౧౦

మొలయందు, పైడిగంటలు, గల్లుమని
  మ్రోయ
  పులిగోరు మెడయందు పాలు పోసంగ
నల్లని ముంగురుల్ - నాట్యమాడుచునుండ
  చిఱునవ్వు నెమ్మోము జెంగలింప
భుజకీర్తులు, గిరీటము, మొదలుగాఁ బఱు
  తెఱఁగుల సొమ్ములు మురువొసంగ
నీరజంబులవంటి నేత్రద్వయంబుతో
  శ్యామల దేహంబు సొరులీన
బాలరామ! శోభించెదు లీలతోడఁ
బద్మకాంతిఁ బ్రకాశించు పద్మనాభ!
స్మరణ మొనరింతు సతతంబు మమతతోడ
నీదు లీలలఁజూపి సమ్మోదమిమ్ము.

౧౧

శత సూర్యులనుమించు - ద్యుతిఁగల్గి వెల్గెడు
  శ్రీరామ! గుణధామ! శ్రీనివాస!

శ్రీవత్స చిహ్నంబుచేఁ గుండలములచే
  సుప్రకాశంబిచ్చు సుందరాంగ!
సీతా మనోహరా! చిఱునవ్వు శోభించు
  ముద్దుమొగముగల్గు మోహనాంగ!
భూషణభ్రాజిత దేహంబుతోనొప్పి
  స్తుత్య దేవేంద్రుఁడై శుభములందు
రామ! నీలమేఘశ్యామ! రక్తితోడ
సురతరులక్రింద వెలుఁగొందు శుద్ధరత్న
పీఠమందుఁ గూర్చున్నావు; వేదవేద్య!
రామచంద్రప్రభూ! కావవే-మహాత్మ!

౧౨

కపికుల బలగంబు - కడలికి సేతువు
  'గట్టగా శ్రీరామ! కడకతోడ
లంకాపురముఁజొచ్చి - రావణాదిగ, రాక్ష
  స కులంబు మడియించి సాహసమున
సీతను గైకొన్న - సీతా మనోహరా!
  అమరుల కానందమమరె; మునిజ
నంబులకెల్ల మోక్షంబుఁ బ్రసాదించి
  సర్వసుఖంబులఁ బర్వఁజేసి
ధర్మరక్షణ మొనరించి దనరినావు
ప్రతిభవచ్చెను శ్రీ రఘువంశమునకు
గాన మొనరింతు నీ రమ్యకథలు; తప్పుఁ
బట్ట కాలింపు శ్రీరామ! భక్తవరద!

౧౩

యోగీశ్వరులు నిన్ను-రాగంబుతో, స్తోత్ర
  ములు సేయుచున్నారు ముక్తివరద!
అఖిల గుణంబుల కాధారమైనావు
  సుర విమానముతోడ బరగినావు
ముక్కంటి పూజింప ముదమునందెద వీవు
  సీతా మనోహరా! శ్రీనివాస!
హృదయపద్మంబున కినుఁడవై, యద్దాని
  వికసింపఁజేసెడి విమలచరిత!
సుందరులలోన మన్మథ సుందరుఁడవు!
రామ! రఘుపతీ! శ్రీ పరబ్రహ్మ వీవు!
నిన్ను స్మరియించువారికి సన్నుతాంగ!
ముక్తి చేకూరకుండునే భక్తసులభ!

౧౪

వరగుణమణులకు - వనధివి శ్రీరామ!
  వసుధాత్మజకుఁ బ్రాణబంధు వీవు!
మేరు పర్వతమును - మించు ధైర్యముగల్గి
  దనుజులఁ జెండాడి దనరితీవు!
దశరథునకు ముద్దు తనయుఁడవైనావు
  భువన భద్రఖ్యాతిఁ బొందినావు
సురముఖ కమలముల్ శోభింపఁజేసెడి
  కరుణాళుఁడైన, భాస్కరుఁడ వీవు!
భూతలాబ్జమరయ - రాతిరి ముకుళించి
ప్రొద్దువొడువ సుఖము బొందురీతి
నీదురాక మాదు నెమ్మనాబ్జంబులు
వికసనంబులంది - వేడ్కలందు.

(సశేషము)

# తోడి దొంగలు

"శార్వాణి"

—X—

నడుస్తున్న రాధ చటుక్కున ఆగి, వెనక్కి తిరిగి చూచింది. నడి బజారులో చప్పట్లు చరచి తనని హేళనచేయడానికి తప్ప ఎందుకా ప్రయత్నం చేయాలి? జరిగిన అవమానాన్ని స్వీకరించి, సరియైన సమాధానం యివ్వాలని అభిలషించింది. వెంకట్రావు ఆమెను సమీపించాడు. ఇద్దరూ కలసి ముందుకు నడవసాగేరు.

"మీ మార్గానికి అంతరాయం గల్గించినందుకు మీ రెంతో మథనపడుతున్నారనుకుంటాను. అలా జరిగితే క్షమించమని అడుగుతున్నాను."

అతని ధోరణికి రాధ సన్నగా నవ్వి, వెంటనే ముఖం గంభీరం చేసుకుంది.

"తెలియకుండా జరిగిన పొరపాటుకు, క్షమించబడటానికి అర్హాలు. తెలిసి చేసిన తప్పును క్షమించమని అడగటంలో, మరొక తప్పు చేస్తున్నారన్నమాట."

అతని మొహం వెలవెల బోయింది. అటువంటి జవాబు ఆమె ద్వారా వస్తుందని ఊహించివుంటే, అతడు ముందే జాగ్రత్తపడేవాడు.

"యదార్థాన్ని మీరు సుధీర్ఘంగా అర్థంచేసుకుంటారు. అందుకనే ఆఫీసులో అందరిదృష్టిలో ఆకర్షింపబడుతున్నారు."

ఆమె తృళ్ళిపడి, అతని కళ్ళలోనికి చమత్కారంగా చూచింది.

"అందుబాటులో దొరికితే అందమైన వస్తువు ఎదుటివాని దృష్టితో మీరు వూహించినట్లే సంభవిస్తుంది."

"మీ మాటలు నాకు అర్థమవుతున్నవి. ఆ వెనుక వున్న నిజంమాత్రం ఎంత తరచినా బోధపడటంలేదు."

"వెనుక దాగిన సత్యాలను తెలుసుకోడానికి, ఒక్క మనస్సే కాదు! హృదయంకూడా అవసరం. సహృదయులయితే, తేలిగ్గా తెలుస్తుంది."

"నే నీవిధంగా మీతో వస్తున్నందుకు మీరేమి బాధపడరా!"

"మీకీసందేహం, మీరు చప్పట్లు చరచకముందు వచ్చివుంటే, మీరిలా అడిగేవారుకాదు. అయినా నాకు తెలియక అడుగుతాను. మీరు నన్ను ఏమని తెలుసుకొని యిచ్చటకు వచ్చారు?"

కొన్ని క్షణాలు అతడు మౌనముద్ర వహించాడు.

"ఎదుటివారు బాధపడతారని తెలుసుండీకూడా మనం కొన్ని తప్పపనులు చేస్తుంటాము. మీరీవిషయంలో నాతో ఏకీభవిస్తారనుకుంటాను."

ఈసారి అతని ముఖంలో కత్తి వేటుకు నెత్తురు చుక్కలేదు.

"మీ మనస్సును గాయపరచాను. ఈ ప్రయత్నం మీకు తెలియాలని చేశానని మీరు అనుకుంటే నన్ను మరొకసారి మీరు అవమానించడానికి పూనుకోరు."

పాపం! మానవుడు ఈ తడవ పూర్తిగా చిత్తయిపోయాడు. కుండపగలగొట్టినట్లు మాట్లాడుతుంటే ఏం చేయగలడు!

దారిలో వాళ్ళిద్దరకు ఎదురైన సుందరం చూచి కన్పించేలాగ నవ్వి, వెళ్ళిపోయాడు.

"అతడు ఎందుకు నవ్వుతున్నాడో మీరు ఆకళింపు చేసుకున్నారా?"

"మీకు తెలియకనా, నన్ను అడుగుతున్నారు."

"మీచేత చెప్పించాలని అడిగాను. ఇప్పుడు నేను

చెప్పినదానిలోకంటె, మీరు చెప్పే విషయంలో బరువు ఎక్కువవుంటుంది."

"మనం యిద్దరం కలసి వెళ్తున్నామని చూచి నవ్వి వుంటాడు."

"ఆ సంగతి నాకు తెలుసు ఆ నవ్వులో స్వభావం ఎటువంటిదా" అని అడుగుతున్నాను.

"మీరు ఆఫీసుకు వెళ్ళినతర్వాత మీరే తెలుసు కుంటారు,"

"జంతువు జంతువును అర్థంచేసుకున్నంత యిదిగా మనిషి మనిషిని అర్థంచేసుకోలేని రోజులు ఆసన్న మయ్యాయి. మరుక్షణంనుంచి 'రాధ-వెంకట్రావులు?' ప్రతిమనిషి హృదయగోళము పగలగొడుతూవుంటారు. ఇద్దరిమనుష్యులకు మధ్యవున్న సంబంధాన్ని కళంకితపరచి జుగుప్సతో మనస్సులను కాల్చుకుంటారు. మొన్న మా మామయ్యతో కలసి వస్తున్నానని, ఎగ్జిబిషన్‌లో జంతువులను చూచినట్లు చూశారు."

"నేనీవిధంగా మీతో వస్తున్నానని మీ కేమైన భయంగా వుందా!"

"పురుషులకు లేనిభయం స్త్రీలకు మాత్రం ఎందు కుంటుంది?"

"అట్లాగ అనుకొని పురుషులలాగ స్త్రీలు ప్రవర్తించరుగదా?"

"అంటే!"

"తర్వాత మీకు చెబుతాను. ఆఫీసు వచ్చేసింది." వెంకట్రావు తనుపనిచేస్తున్న సెక్షన్లోకి వెళ్ళిపోయాడు.

రాధ అకౌంట్స్ సెక్షన్లో కాలుపెట్టిన వెంటనే, మధు విష్ చేశాడు.

"గుడ్ మోర్నింగ్!" రాధ తన కుర్చీలో కూర్చుని అతనివేపు చూచింది.

"ఆడవాళ్ళను నమ్మి ఏ మగవాడు బాగుపడ్డాడో చెప్పండి."

"వచ్చీరావడంతోనే యింత పెద్ద అభియోగాన్ని తెచ్చిపెట్టారు.."

"బోలుడన్ని పనులు మానుకొని, మీరువస్తారని నిన్నల్లా యింటిదగ్గర పడిగాపుల పడివున్నాను."

"చంపేశారు! మోసమంటే యిదేనా!"

"మీరు మోసం చేశారని ఒప్పుకోటంలేదా! మీ కోసం ఎన్నో పదార్థాలు స్పెషల్‌గా తెప్పించి నందుకు, బలే దగా చేశారు."

"మీరాప్రయత్నం చేస్తారని తెలుసుండే మాని వేశాను. మీకు మంచి పనిష్‌మెంటు అయింది!"

"మీ రింకెప్పుడూ మా యింటికి రావాలని అనుకో వొద్దు. ఒకసారి దగాబడిన తర్వాత, మళ్ళా మళ్ళా దగాపడటం నాకిష్టంలేదు. అందులో ఆడవాళ్ళచేత."

"ఏమండోయి మధుగారు! నాకు కోపంవచ్చేటట్లు మాట్లాడుతున్నారు."

అంతలో సెక్షన్ హెడ్ వస్తే ఎవరికి వారు గప్ చిప్‌గా వుండి వారి వారి పనులలో నిమగ్నులై పోయారు.

సాయంత్రం ఒక గంట పర్మిషను తీసుకొని, మధు నాలుగు గంటలకే వెళ్ళిపోయాడు. ఊళ్ళో షాపింగ్ చేస్తుంటే తనస్నేహితురాలితో రాధ అచ్చటకురావడం సంభవించింది.

"మీరు బట్టలు కొంటున్నారన్న సంగతి తెలు సుంటే, మీతో మేము వచ్చేవాళ్ళముగా!" మధుకి తన స్నేహితురాలిని పరిచయంచేసింది.

మీ కథలు చదివినతర్వాత మిమ్మల్ని చూచినప్పుడు అసంభవమైన విషయం సంభవమయినట్లుగావుంది!"

"ఈమెకూడా కవిత్వం వ్రాస్తుంది! అందుకనే ఆ ధోరణి అట్లావుంది."

"నేను కొనడం అయిపోయింది. నాకు సెలవు యిప్పిస్తారా?"

"సెలవు మీ దగ్గర మేము తీసుకోవాలి, అంతా కలసే వెళ్దాం." మధు చేయిపట్టుకొని లోపలకు తీసుకొని వెళ్ళింది. అతడేమాత్రం చాంచల్యాన్ని ప్రకటించలేదు.

"మధు! ఈ చీర చాల బావుంది కదూ!" ఏకవచన ప్రయోగానికి మధు తృళ్ళిపడ్డాడు.

"చీరలవిషయంలో నాకేమంత నాణ్యం తెలీదు."

"పోనీ చీరలు కట్టుకొనేవాళ్ళ నాణ్యం తెలుసనుకుంటాను."

"చీరల అందచందాల విషయంలో, ఆడవాళ్ళ కంటె మగవాళ్ళకే ఎక్కువ తెలుసును." స్నేహితురాలు వంత పాడింది

వారి మధ్య జరుగుతున్న సంభాషణను శ్రద్ధగా వింటున్న కొట్టువాడు "ఆడవాళ్లు చెప్పింది నిజమని" దఫీమని ఒప్పుకున్నాడు.

మధు సెలక్టుచేసిన చీర రాధ తీసుకొంది. షాపులో నుంచి బయటకు వచ్చినతర్వాత మధు చేతిలో పేకెట్టు తీసుకుంది.

"మీ ఇంటికి వస్తున్నాం!"

"ఆ ప్రయత్నం చేయవొద్దని మీకు ప్రొద్దున్నే మనవిచేసుకున్నాను."

"మీ ఇంటికివచ్చి మీ ఇంట్లో సర్వస్వాన్ని దోచుకోములెండి."

"మీకు చేతికి చిక్కేది దారిద్ర్యమేవుంది."

"కవిగారు పేద అరపులు మొదలు పెట్టారు."

"సన్మానంచేసి, రెండు అగ్రహారాలు వ్రాసి యివ్వకూడదా!"

"ఓసి అంతేనా! తలచుకుంటే మీకీరాజ్యంలో పట్టాభిషేకమేచేస్తాం."

"కాగితపు పువ్వులతోనా!"

"ప్రాణంవున్న పువ్వులతోనే!"

"మీతో మాటలు పెట్టుకుంటే, రోజుకి గంటలు పొడిగించాలి! చాల ప్రొద్దుపోయింది వెళ్తాను."

"మేము వస్తామని అంటున్నా కూడా తిరస్కరిస్తున్నారు. ఇంత కంటె అన్యాయం మరొకటి వుంటుందా!"

"బొట్టుపెట్టి పిలచినప్పుడు రాలేదు, యిప్పుడు వస్తారని నమ్మకం ఎక్కడవుంది!"

రాధ జట్కా పిలపించింది. అందరూ కలసి మధు యింటికి వెళ్ళారు.

"ఏమండీ మీ యింట్లో యింత పెద్ద గులాబిచెట్టు వుందని తెలుసుంటే రోజూ వచ్చేదాన్ని."

గులాబి చెట్టుదగ్గరకు వెళ్ళి పూవులను కోయబోయింది.

"పువ్వులను కోయకండి! మేమెప్పుడూ ఒక పువ్వు కూడా కోయలేదు."

రాధ చటుక్కున ఆగిపోయింది.

"గులాబీలను చిగుర్ల నుంచి త్రుంచివేస్తే చెట్టుకి అందం పోతుంది. పువ్వులన్నీ చెట్టుకుంటే ఎంత అందంగా వున్నాయో చూడండీ,"

"మాసిగలో వుంటే యింకా అందంగా వుంటుందిగా!"

"అని మీరు అనుకుంటున్నారు. కోసిన మరుక్షణమే ఆ అందం వాడిపోతోంది."

"అయితే మేము పువ్వులు పెట్టుకోవడం మీకిష్టం లేదన్న మాట."

మధు వెంటనే చెట్టుకున్న పువ్వులన్నీ కోసి వేశాడు.

"ఇప్పుడు ఆ చెట్టువేపు చూడండీ!" కోసిన

పువ్వులన్నీ మాలగా గ్రుచ్చి, మధు దగ్గరకు వెళ్ళి, ఆ దండ అతని మెడలో వేసింది.

"చాలా బావుంది. ఆ చెట్టుకాదు ఈచెట్టు." రాధ మనస్తత్వం మధు ఎంత ఆలోచించినా అంతు చిక్కడంలేదు.

"మిమ్మల్ని అర్థంచేసుకోవడం నాకు చేతకావడం లేదు. ఏంచేయమంటారు."

రాధ కళ్ళలోనికి తొంగిచూశాడు.

సిగ్గుతో ఆమె కళ్లు తడిసి ఆరిపోయాయి.

"నాకే అర్థంకాదు. మీకేమి అర్థమవుతుంది."

"నలుగురు మగవాళ్లు మసిలేచోట మీ ప్రవర్తన కొంచెం మార్చుకోవాలి! ఆడది కాస్త నదరుగా కన్పించేసరికి, మగవాని చిత్తవృత్తి రకరకాలుగా మారుతుంది!"

"మీకుకూడా మారుతుందా!"

"మారితే మారవచ్చు; మేమంతా పరిస్థితులకు వారసులమే గదా!"

"మీరూ అందరిలాగే మాట్లాడుతున్నారు."

"మాట్లాడటంలేదు. మాట్లాడించ బడుతున్నాను. మీకింకా మీ ముందు చాల జీవితంవుంది. ఈ రోజు జరిగినలాగ రేపు జరగదు. మన జాగ్రత్తలో మనం వుంటే, రేపు మనల్ని ఎవరు అపార్థం చేసుకోరు."

"మీరు చెప్పేది!"

"అందరితోను అంత చనువుగా పల్కరించడం తగ్గించండి. మీరు కోరుకుంటున్న గాంభీర్యాన్ని మీతో పల్కరిస్తున్న వాళ్లు గ్రహించడంలేదు. వాళ్లు ఆనందాన్ని వాంఛిస్తున్నారు. అప్పుడు జీవితం ఎంత చులకన అయిపోతుందో మీరు తెలుసుకోవాలి!"

మధు మెడలోవున్న మాలను తీసి ఆమె దగ్గరగా వెళ్ళి నిలబడ్డాడు.

"ఈ దండ నా మెడలో యింతకుముందు మీచేత వేయబడ్డది. ఇప్పుడు దీన్ని మీ మెడలో వేస్తే, ఏం జరుగుతుందో ఆలోచించారా!"

రాధకేమి అర్థంకాలేదు. మెదలకుండా అతని వంక చూస్తూ వుండిపోయింది!

"నేను మీరు చేసిన పని చేయడంలేదు. నేను చెప్పిన సంగతిని బాగా అర్థం చేసుకోండి."

దండ బల్లమీదపెట్టి వెనక్కి తిరిగి తన కుర్చీలో వచ్చి కూర్చున్నాడు.

పనిమనిషి, కారియర్ తెచ్చి, దూరంగానిలబడింది.

"ఇంట్లో ఆడవాళ్ళెవరూ లేరా!"

"ఆమెకు భర్తదగ్గరకంటె పుట్టింటిలోనే హాయిగా వుంటుంది. ప్రతిఉత్తరంలో వస్తున్నానని వ్రాస్తుంది, ప్రతిరోజూ నాకు హోటల్ భోజనం తప్పడంలేదు."

"మీ ఆవిడవచ్చేవరకు నన్ను వండి పెట్టమంటారా. మిమ్మల్ని చూస్తుంటే జాలివేస్తుంది. రోజురోజుకీ చిక్కి శల్యమైపోతున్నారు."

మధు మాట్లాడలేదు.

"మీకు అభిమానంతోబాటు ఆగ్రహం ఎక్కువ. మిమ్మల్ని ఏమని అడగడానికి కూడా భయమేస్తుంది. పాపం! ఆ అమ్మాయి మీతో ఎట్లా కాపురం చేస్తుందో!"

"అయ్యగారికేమండి! వెన్నపూసలాంటి మనసు" పనిమనిషి అడ్డుపడి, వూరుకోలేక అంది.

మధు లేచి నిలబడ్డాడు.

"భోజనం వేళ అయినట్లుగావుంది. వెళ్తాము." రాధ బయలుదేరింది.

"మీరుకూడా భోజనం చేసి వెళ్ళండీ ఇంకో క్యారేజి తెప్పిస్తాను."

"మేము కూడా చిక్కాలనివుందా మీకు." రాధ స్నేహితురాలిని వెంటబెట్టుకొని, మధు దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయింది.

నిన్న కొన్న చీరకట్టుకొని రాధ ఆఫీసుకువచ్చింది. ఇంటిదగ్గరనుంచి వచ్చేటప్పుడు సుందరంతో కలసి వచ్చింది మధుచూశాడు. వెంకట్రావుకూడాచూశాడు. ఎవరిమనస్సులో ఏమనుకున్నారో వాళ్ళకే తెలియాలి. ఆఫీసులో మరి కొంతమంది గుమాస్తాలు చూచి, మనస్సులను యింకా కల్లోలితం చేసుకున్నారు. పైకిమాత్రం ఏమి తొణకకుండా జాగ్రత్తపడ్డారు. బాధ సహించడం చేతకానివాళ్ళు, చెవులు కొరకడం ప్రారంభించారు.

'రాధను మన సుందరంగాడు వల్లో వేసుకున్నాడు.' అక్కసునంతా బయటకు వెళ్ళగక్కాడు ఒక మీసాలరాయుడు.

"శతకోటి లింగాలలో ఒక బోడిలింగం!"

తనకు దక్కలేదనే ఈర్ష్యకొలదీ మొహం మాడ్చుకొని విలపించాడు.

"సిన్సియర్‌గా ప్రయత్నంచేస్తే మనకు మాత్రం కాదంటాదా!" పేవుమెంట్‌మీద రంగుల సీతాకోక చిలుకలకోసం హంటింగ్ చేసే రోమియో సన్నగా గొంతుక చించుకున్నాడు.

ఆమెను గురించి రకరకాల అభిప్రాయాలు తయారయ్యాయి. ఎవరికి తోచినట్లుగా వారు వెల్లడి చేస్తున్నారు. లోగుట్టు పెరుమాళ్ళకే తెలియాలి!

సాయంత్రం ఆఫీసునుంచి వెళ్లేటప్పుడు సుందరం ఆమెతోనే బయలుదేరాడు. వాళ్ళిద్దరిమధ్య కల్పించిన సంబంధాని ఖాయపరచుకున్నారు. చాటుగా కన్నీరు కార్చేవాళ్లు కార్చేరు.

"మనగురించి చాల అసహ్యంగా చెప్పుకుంటు న్నారు." సుందరం ఆమెకు ప్రక్కగా నడుస్తూ అన్నాడు.

"అసహ్యంగా ప్రవర్తిస్తేగా భయపడడానికి! వాళ్ళిష్టమొచ్చినట్లు అనుకోనీయండి."

"వాళ్ళ అనుమానాన్ని యింకా స్థిరంచేయాలి. వాళ్ళమతులు పూర్తిగా పోయేటట్లు ఏడిపించాలి!"

"అందుకనేనా యిప్పుడు కూడా నాతోనే వస్తున్నారు!" సుందరం అదిరిపడ్డాడు.

"మీరు నన్ను అపార్థం చేసుకుంటే, మీతో యింత చనువుగా వుండేవాడ్ని కాదు."

"నలుగురితో కాస్త సోషల్‌గా వుండేసరికి, మగవాళ్లు స్త్రీని యింత చవకగా చూస్తారని అనుకో లేదు."

"ప్రత్యక్షంగా నాతో వాదించే వాళ్ళతో, సరియైన సమాధానం చెప్పాను."

ఇంతలో సుందరం యిల్లు వచ్చేసింది. ఆమెను కూడా ఇంట్లోకి రమ్మని ఆహ్వానించాడు.

రేడియో పెట్టాడు. ఆమె వాలు కుర్చీలో జారి గిలపడింది.

"మీరు వివాహం చేసుకోదలచుకో లేదా" సుందరం మంచంమీద కూర్చుంటూ, కాటుకతో పెద్దవయిన కళ్ళలోనికి చూస్తూ అడిగాడు.

"నేనీవిషయం ఎప్పుడూ అనుకోలేదు."

"వివాహంలోవున్న సుఖం, యీలా బ్రతకడంలో వుండదనుకుంటాను. ఇప్పుడు మీకు భర్త పిల్లలు, సంసారం, ఏ బాదరాబంధీ లేదు. అందుకే ఎప్పుడూ హాయిగా కన్పిస్తారు."

"మీ కెంతమంది పిల్లలు?"

"ఇద్దరు"

'మీకు సంసారం సుఖం బాగుంటుందనుకుంటాను.'

"సంసారం యాంత్రికంగా సాగిపోతోంటుంది. సుఖంమాత్రం సున్న."

"మీరు కూడా ఆధిక్యాన్ని కోరుకుంటారు నిజమేనా?"

"మీరు బాగా అర్థంచేసుకున్నారు."

"అందుకనే నాకు వివాహమంటే ఏవగింపు."

ఇప్పుడు నా మనస్సులో అభిప్రాయాన్ని సరిగా తెలుసుకున్నారు.

అతడు ఆమెకు దగ్గరగా సమీపించి. వెనుకనుంచి రెండు భుజాలమీద చేతులువేసి నొక్కిపట్టాడు.

ఆమె చివాలను లేచి నిలబడింది.

"నేను ఆధిక్యాన్ని కోరుతున్నాను."

"ఇంటనే ఆత్మహత్య చేసుకుంటే మంచిది."

"ప్రేమించడం తప్పా!"

"మీలాంటి పెద్దమనుష్యులు ప్రేమించడం మహాపరాధం."

"సౌందర్యాన్ని ఆస్వాదించడంకూడా నేరమా!"

"వొట్టి అల్ప సంస్కారులు. మీ హృదయంలో యింత కల్మషం కరుడుకట్టుకొని పోయిందని తెలుసుంటే, మీకు ఆఫీసులోనే పాఠం నేర్పేదాన్ని."

"రాధ! నేనేకాదు, నీతో చనువుగా వుంటున్న అందరూ అందాన్ని వాంఛించేవాళ్ళేగాని, మనస్సులో మంచివున్నవాళ్లు లేరు."

తిరిగి సమాధానం చెప్పకుండా. రాధ అచ్చటనుంచి వెళ్ళిపోయింది.

ఆ మరుసటి రోజు రాధ ఆఫీసుకి మామూలుగానే వచ్చింది. పూర్వంలాగ ఎవరితోనూ, ఎక్కువగా మాట్లాడుతున్నట్లు లేదు. సుందరం ఆరోజునుంచి పదిహేను రోజులు సెలవుపెట్టి స్వగ్రామం వెళ్ళిపోయాడు. కారణం ఆ సెక్షన్లో రాధకు తప్ప యింకెవరికీ తెలియదు.

ఏదో పనిమీద టెలిఫోను బూత్‌కి వెళ్తే, అచ్చట వెంకట్రావు తారసిల్లాడు.

"ఇవ్వాళ నాజ్‌లో మంచి పిక్చరు, వస్తారా!" అని అడిగాడు.

"సినిమాలకు నేను ఎక్కువగా వెళ్ళను."

"కావలసినవాళ్ళతో ఒకేరిక్షాలో వెళ్తుంటారు"

"మీ కిప్పుడు బాధగావుందా!"

"ఆఫీసంతా కోడైకూస్తుంటే బాధగావుండదా!"

"కుక్కలు అరిస్తే ఏనుగు ఏమి అనుకుంటుంది."

"లెట్ దెమ్ బార్క్ అనుకుంటుంది."

"అంతే!"

"అందుచేతే నాతో సినిమాకు రమ్మని కోరుతున్నాను."

"ఒక్క సినిమా ప్రోగ్రామేనా? ఇంకా ఏమైనా వుందా!"

"మీ కేది కావలస్తే అది వుంటుంది."

"మీ మనస్సులో విషయం యిప్పుడు నాకు బాగా బోధపడింది."

"అదే నాకు కావాలి! ధన్యుడ్నయ్యాను!"

"అంతా ఒక్కే తరగతి. సుందరం...తర్వాత వెంకట్రావు. నా బదులు మీ శ్రీమతిని సినిమాకు తీసుకొని వెళ్ళండి. ఆమెను ఎప్పుడూ మీరు సినిమాకు తీసుకొని వెళ్ళనందుకు ఆమె కోరికను కనికరించి నెరవేర్చండి. చాల సంతోషిస్తుంది."

మళ్ళా వెనక్కి తిరిగి చూడకుండా, అచ్చటనుంచి వచ్చేసింది.

♦ ♦ ♦

తను ఆఫీసులోచేరిన రెండు నెలలోనే చాల మందిని బాగా అర్థంచేసుకొంది. అంతా తోడిదొంగలు. పయోముఖ విషకుంభాలు. తేనిపూసిన కత్తులు. సుందరం పైకి ఎంతో పెద్ద మనిషిలాగ కన్పిస్తాడు. ఇద్దరు పిల్లలు కలిగినా, అతని హృదయంలో కుళ్లు కరగడదనేలేదు. వెంకట్రావు సుందరానికి ఏవిధంగా తీసిపోడు. నీతి కబుర్లు ఏకరవు పెడతాడు. నాలుక వెనుక నిలువెల్లునా విషమే! కాటేస్తే, నెత్తురు చిమ్ముతుంది. అటువంటి వాతావరణంలో మసలడం, రాధకు దుర్లభంగానేవుంది. మానవత్వాన్ని చంపుకొని అడుగడుగునా ఆత్మ వంచనచేసుకొనే మనుష్యులు, జీవితంలో తారసిల్లుతుంటే, తనకు ధైర్యం పెరుగుతోంది. "దుర్మార్గాన్ని

మంచితోనే సంహరించాలి. అవినీతిని నీతితోనే కాల్చివేయాలి." మనస్సులో నిర్ణయించుకుంది.

రాధ మొదటిఆటసినిమాకు వెళ్ళింది. మధు అదే ఆటకు రావడం సంభవించింది. సినిమా వొదిలి పెట్టిన తర్వాత, అకస్మాత్తుగా మబ్బులు ముమ్మరంగా వ్యాపించిపోయి, కుండపోతగా వర్షం కురవ నారంభించింది.

"ఈ వర్షం యిప్పట్లో వదిలేటట్లులేదు. ఇక్కడ ఎంతసేపని నిలబడతాం! మా ఇల్లు దగ్గరగావుంది." మధు రాధవేపుచూచి అన్నాడు.

"కాస్త వెలవనివ్వండి, అలానే చేద్దాం!" గాలి హోరున వీస్తోంది. మబ్బులు విచ్చిపోతున్నయి. తుప్పరపడుతూనేవుంది. మధు రాధతో తను వుంటున్న యింటికి చేరుకున్నాడు.

"ఒక్క రిక్షాకూడా లేకుండాపోయింది!"

"వర్షంలో వాళ్ళు మాత్రం చస్తారా!" తువాలుతో తలవెంట్రుకలను తుడుచుకొని, కుర్చీలో జారగిలబడింది.

"అమ్మ నా కోసం ఎదురుచూస్తూ వుంటుంది."

"వర్షం వచ్చింది కాబట్టి, కాస్సేపు ఆలస్యంగా వస్తుందని అనుకుంటారు."

మళ్ళా వర్షం పూర్వంకంటె ఎక్కువగా కురుస్తోంది. వరండాలోనికి ఝల్లు కొట్టేసరికి, రాధ అచ్చటనుంచిలేచి గదిలోనికివెళ్ళి మంచంమీద కూర్చుంది.

"వర్షంలో ఏమితడుస్తారు. లోపలకురండి!" మధు గుమ్మం దగ్గర కుర్చీవేసుకొని కూర్చున్నాడు.

బయట చాల భీభత్సవంగావుంది. లైట్లన్నీ ఆరిపోయాయి. కన్నూ మిన్నూ కానని కటికచీకటి. ఉప్పెనలాగ గాలి, తడవ తడవకి ఉరుము. వర్షానికి వీధులన్నీ మడుగులయిపోయాయి.

ఎలక్ట్రిక్ దీపం ఆరిపోతే, కొవ్వొత్తి వెలిగించి పెట్టాడు.

"తెల్లవార్లూ వుండేటట్లుంది గాలి వాన."

"ఇటువంటి సమయాల్లో మీరు ఒంటరిగావుంటే చాల భయపడతారనుకుంటాను."

"మీకు అట్లానే వుంటుందా!"

"నాకనిపించదు."

"ఎందుకని?"

"నేనెప్పుడు ప్రళయాన్నే కోరుకుంటాను. తుఫాను, భూకంపాలు, యుద్ధాలు భూమికి అప్పుడప్పుడు అవసరం. పర్యవసానంగా కొత్త జన్మ కొత్త మనుష్యులు ఉత్పన్నమవుతారు."

"అని అంటారేగాని, చావడానికి భయపడుతూనే వుంటారు. సుందరం వెంకట్రావులమీద మీకు ఎటువంటి అభిప్రాయంవుంది?"

"నా మనస్సుకి తెలిసినంతవరకు, మంచి మనుష్యులుకారని. అయినా వారిద్దరి గురించి ప్రత్యేకంగా ఎందుకు తెలుసుకోవాలని అనుకుంటున్నారు?"

"తెలుసుకోవాలని బుద్ధి పుట్టింది. అంతే!"

"నా గురించి మరొకరిద్వారా తెలుసుకోవాలని బుద్ధి పుడుతుందా!"

"ఈ సందర్భంలో మీరు నాకు అర్థంకావడం లేదు."

"బహుశా మీరుకూడా అంతేనేమో!"

"నన్నిప్పుడేకాదు, ఎప్పుడూ అర్థంచేసుకోలేరు. చలిగావుంది. దుప్పటి కప్పుకోమంటారా!"

"చాల ప్రొద్దయిపోయింది. వర్షంవెలిసే సూచనలుకూడా కన్పించడంలేదు. నిద్రపోండి!"

"మీరెక్కడ పండుకుంటారు?"

"వరండాలో!"

"జల్లుపడుతుందిగా!"

"పర్వాలేదు."

"త్యాగంచేస్తున్నారా!"

"అలవాటులేదు."

"భలేగా మాట్లాడతారు."

"మీరే నేర్పుతున్నారు."

"బాగుపడతారు."

"అయితే కృతజ్ఞుడ్ని."

మధు లేచి, వర్షంపడనిచోట వాలుకుర్చీ వేసుకున్నాడు. మెల్లిగా కళ్ళు మూశాడు. మాగన్నుగా నిద్రపట్టింది. ఒక రాత్రి మెలుకువవచ్చింది. బాగా వర్షం వెలిసిపోయింది. గది తలుపులు దగ్గరగా జారిగిలవేసివున్నాయి.

లేచి తెరచిచూశాడు.

రాధ మత్తుగా నిద్రపోతోంది. వెంటనే తలుపులు దగ్గరగావేసి, కుర్చీలోవచ్చి కూర్చున్నాడు. పెరటిలో గులాబిచెట్టు గాలికి వొంగిపోయివుంది. రేకులు నీళ్ళలో తేలుతున్నాయి.

ఆకాశం నిర్మలంగావుంది. చల్లని గాలితెరలు సన్నగా వీస్తున్నాయి. మధు లేచి గది తలుపులు తెరచాడు.

నరాలలోని రక్తాన్ని ఎవరో ఏ తాంతో తోడేస్తున్నట్లుగా శిలయ్యాడు.

రాధ వికలిత నిద్రలో మునిగిపోయివుంది. మంచం పట్టీమీదవచ్చి కూర్చున్నాడు. భయంతో వొణికిపోయాడు. గుండె దడదడ కొట్టుకుంటోంది. ఎంత అదిమిపట్టినా శబ్దం ఆగడంలేదు.

వణుకుతున్న చేతులతో ఆమె బుగ్గలను స్పృశించాడు. ఆమె ఉలిక్కిపడిలేచింది.

"మధు!"

అతడు మంచంమీదనుంచిలేచి, తల వంచుకొని దూరంగా నిలబడ్డాడు.

"ఈ ప్రపంచంలో మిమ్మల్ని ఒక్కర్ని విశ్వశించాను."

అతడు సిగ్గుతో కృంగిపోయాడు.

"మీకంటె సుందరం, వెంకట్రావులే నయం."

అతడు అవమానంతో కృంగిపోయాడు.

"మీరు యితరులకు పాఠం నేర్పబోయేముందు, మీ మనస్సును మంచిగా చేసుకోండి."

అతడు నిలువెల్లునా భయంతో వణికిపోయాడు.

"ఒక తృటికాలంలో అమూల్యమైన ఆశయాన్ని అంతంచేశారు."

అచ్చట వుండలేక వెంటనే బయటకు వచ్చేశాడు.

"వెళ్ళిపోకండి! మీకు కావలసింది తుచ్ఛమైన ఈ శరీరం! అంతేనా!"

"రాధా! నన్ను చంపకు! నేను చనిపోయాను."

"చనిపోయిన మీ శవంలోనుంచి దాటిపోయిన ఆత్మను తాకండి. జ్ఞానోదయం గల్గుతుంది."

రాధ వెళ్ళిపోయింది!



## సినిమాలలో "మేకప్"

సినిమా మేకప్ వృత్తికి పరిపూర్ణమైన కౌశలమే గాక, కళలయొక్క సమగ్రమైన పరిజ్ఞానం కూడా అవసరం. సాహిత్యం, నాటకరంగం, లలిత కళల యొక్క సంయోగమే సినిమాకళ అన్న విషయం అందరికీ తెలిసిందే.

ఒక చిత్రంలోని పాత్రల రూపురేఖలు యెలా వుండాలో నిర్ణయించే బాధ్యత మేకప్ చేసే మనిషిదే. చిత్రంయొక్క దర్శకునితో కలసి అతడు ఆ విషయాన్ని నిర్ణయిస్తాడు. సినిమా స్క్రిప్టును జాగ్రత్తగా పరిశీలించి ఆ నిర్ణయాన్ని అతడు చేస్తాడు.

### నటులను "రూపొందించడం."

ఒక నటుడు మేకప్ రూమ్‌లోనికి వచ్చినప్పుడు మేకప్‌మాన్ ఆ నటునియొక్క ముఖ కవళికలు, అతని లక్షణాలను గురించిగాక, అన్యరూపాన్ని దాల్చగల శక్తి అతనిలో యెంతవరకు ఉన్నదన్న విషయాన్ని గురించి యెక్కువగా పరిశీలించవలసి ఉంటుంది. అటువంటప్పుడు మేకప్ మ్యాన్ పని, చిత్రాన్ని గీయబోయేముందు తన "మోడల్"ను పరిశీలించే పనిని పోలిఉంటుంది. ఇక మేకప్ చేస్తున్నప్పుడు అతనిపని శిల్పాన్ని మలచే శిల్పిపనిని పోలిఉంటుంది. అతడు చిత్రంలోని పాత్రలను "మలచుతాడు." మొదట్లో పాత్రకు అవసరమైన రూపాన్ని కల్పించడానికి రేఖలను దిగ్భ్రింతంగా దిదుతాడు. తర్వాత ప్రస్ఫుటమైన కవళికలను రూపొందిస్తాడు. ఇలా "రూపొందిన" మీదట నటుడు రంగంమీదికి వస్తాడు. మేకప్‌మాన్ అప్పటికీ నటుని ప్రతి కదలికనూ పరిశీలిస్తూనే ఉంటాడు. ఒక్కొక్క తడవ రంగస్థలం మీది దీపాల వెలుగులో నటుని చూచినప్పుడు అతని మేకప్‌లో కొన్ని మార్పులు చేయవలసి ఉన్నట్లు తెలియవస్తుంది. అప్పుడు అతడు ఆ నటుని తిరిగి మేకప్ రూమ్‌లోకి తీసుకొనిపోతాడు.

ఏయే దృశ్యంలో దీపాల తేజస్సు యెంతగా ఉంటుంది, యెంతెంత దూరంనుండి "షాట్లు" తీయబడుతాయి, ఆ దృశ్యాలు యేవిధంగా తీయబడుతాయి అన్న సమాచారం మేకప్ చేసే వ్యక్తికి తెలిసి ఉండాలి. ఈ సమాచారం తెలిసిన మీదటనే అతడు నటునికి మేకప్ చేయడం ప్రారంభిస్తాడు.

### మేకప్-ఒక క్లిష్టమైన కళ

చలన చిత్రాలలో మేకప్ పని చాలా క్లిష్టమైన కళ అని అనుభవం పనివల్ల తెలియవస్తుంది. ఈ కళ సినిమా కళకంటే తర్వాతగా ప్రారంభమయింది. అందువల్ల ఈ కళ ఇంకా పెంపొందవలసి ఉన్నది. సినిమా మేకప్ కళ నాటక రంగంయొక్క మేకప్ కళనుండే ఉద్భవించింది. కాని దానిలోని సంప్రదాయాలు కొన్ని సినిమా మేకప్‌కళకు చెల్లవు.

నటుని ముఖంలోని లోపాలనూ, మేకప్‌లోని లోపాలను కెమేరా సులభంగా పట్టివేయగలదు గాబట్టి సినిమా మేకప్ పని చాలా కష్టంతో కూడి ఉంటుంది. ఈ శతాబ్దం మూడవ దశకంలో సోవియట్ సినిమారంగం అనవసరమైన "కళాత్మక"త్వ మేకప్‌ను త్రోసిపుచ్చుతూ, సహజమైన మేకప్‌ను ప్రోత్సహించ సాగింది.

క్లోజప్‌లో దృశ్యం తీయబడుతున్నప్పుడు మేకప్‌లో ఉన్న లోపాలు ఇట్టే తెలిసిపోతాయి గాబట్టి దానిని సాధ్యమైనంత సహజంగా ఉండేట్లు చూడడం అవసరం.

నటుడు తన పాత్రను అర్థంచేసుకొని దానిలో లీనమైపోవడానికిగూడా మేకప్ అత్యంతంగా తోడ్పడుతూ ఉంటుంది. మేకప్ సహాయంతో పూర్తిస్వరూపాన్నే మార్చివేసుకొనడం సాధ్యమవు



7

తుంది. అప్పుడు ఆ పాత్రలో లీనమైపోయి అతిసహజంగా నటించడానికి వీలుకలుగుతుంది.

మేకప్ చేసే వ్యక్తి సినిమాలోని పాత్రలకు "సృష్టికర్త" అవుతాడు. నటుడు తన పాత్రను అర్థం చేసుకొని దానిలో లీనమైపోయి నటించడానికి తోడ్పడుతాడు.

## వివిధరకాల "మేకప్"

సినిమా మేకప్‌లో ద్రవరూపంలో ఉండే రంగులు మాత్రమే ఉపయోగింపబడుతాయి. ఈ మేకప్‌లో వివిధమైన రకాలు ఉన్నాయి. నటుని ముఖంలో యేదైనా లోపం ఉన్నప్పుడు దాని స్వరూపాన్ని మార్చకుండాగే ఆ లోపాన్ని తొలగించడానికి దిద్దుబాటు మేకప్ పద్ధతి అవలంభింప బడుతుంది. వయస్సులో భేదాన్ని చూపించవలసి వచ్చినప్పుడు మరొక రకమైన మేకప్ పద్ధతి ఉపయోగింప బడుతుంది. వ్యాధిగ్రస్థులైనవారి ముఖాలు, స్థూలకాయుల ముఖాలు, హాస్యపు పాత్రల ముఖాలు రూపొందించడానికి వేరువేరు మేకప్ పద్ధతులు ఉంటాయి. ఒక్కొక్కప్పుడు ఈ వివిధపద్ధతులు సమ్మిళితంగా అవలంభింపబడుతుంటాయి.

ఈ విధంగా చలనచిత్రంలోని పాత్రలు నటులు, దర్శకులు, స్క్రిప్టు రచయితలు, ఛాయాచిత్ర గ్రాహకుల చేతనే గాక మేకప్ మ్యాన్‌ల సహాయంతో గూడా సమిష్టిగా సృష్టింపబడుతుంటాయి.

## స్టూడియో వార్తలు

విజయాప్రొడక్షన్ వారి చిత్రం 'అప్పుచేసి పప్పుకూడు' విడుదలకు సిద్ధముగా నున్నది. ఇందులో సావిత్రి, జమున, యన్. టి. రామారావు, జగ్గయ్య, గిరిజ మున్నగువారు నటించారు. దర్శకత్వం శ్రీ ప్రసాద్.

♦ ♦ ♦

శ్రీ జయంతి ప్రొడక్షన్స్‌వారి 'పెళ్ళినాటి ప్రమాణాలు' చిత్రం ఎ. నాగేశ్వరరావు, జమున, ఆర్. నాగేశ్వరరావు, రమణారెడ్డి మున్నగువారితో నిర్మాణమయి త్వరలో విడుదల కాబోతున్నది.

♦ ♦ ♦

'జయభేరి' చిత్రాన్ని శారదా ప్రొడక్షన్స్‌వారు నిర్మిస్తున్నారు. దీనికి శ్రీ పుల్లయ్యగారు దర్శకులు.

♦ ♦ ♦

రాజ్యం పిక్చర్స్‌వారి 'కృష్ణలీలలు' చిత్రనిర్మాణము పూర్తి అయింది. లక్ష్మీరాజ్యం, యస్. వి. రంగారావు, రేలంగి, బాలకృష్ణ, నల్లరామమూర్తి మొదలైనవారు నటించారు. దర్శకులు శ్రీ జంపన.

వెంకటరమణా ఫిలిమ్స్‌వారి 'బాలనాగమ్మ' చిత్రము తయారగుచున్నది. ఇందులో అంజలీదేవి, యన్. టి. రామారావు, రేలంగి, యస్. వి. రంగారావు, రాజసులోచన మున్నగువారు నటిస్తున్నారు. దర్శకత్వం శ్రీ వేదాంతం రాఘవయ్యగారు.

♦ ♦ ♦

ఎం. ఏ. వి. పిక్చర్స్‌వారి 'సంపూర్ణరామాయణం' త్వరలో విడుదల కాబోతున్నది. చ్రమిమా రిలీజ్.

♦ ♦ ♦

భారత ప్రొడక్షన్స్‌వారి 'బభ్రువాహన' సముద్రాలవారి దర్శకత్వముక్రింద నిర్మాణమయి త్వరలో విడుదల కాబోతున్నది.

♦ 8 ♦

ప్రసాద్ ఆర్ట్‌పిక్చర్స్‌వారు తాతినేని సూర్యప్రకాశరావుగారి దర్శకత్వం 'ఇల్లరికం' చిత్రము నిర్మిస్తున్నారు. ఎ. నాగేశ్వరరావు, జమున, గిరిజ, రేలంగి, సి. యస్. ఆర్. మున్నగువారు నటిస్తున్నారు.

♦ ♦ ♦

అన్నపూర్ణా పిక్చర్స్ ప్రైవేట్ లిమిటెడువారు 'మాంగళ్యబలం' చిత్రాన్ని ఎ. నాగేశ్వరరావు, రమణమూర్తి, సావిత్రి, మున్నగు నటీనటులతో తయారు చేస్తున్నారు. దీనికి శ్రీ ఆదుర్తి సుబ్బారావు దర్శకులు.

# దిక్కు లేని యువతులను చేరదీసి విద్యాబుద్ధులు గరపుతున్న విద్యాలయం

శ్రీ వార్కీ చెరియన్

మద్రాసు పరిసరప్రాంతం - తాంబరంలో 6 ఎకరాల తోటలో ఒక సేవా సదనం స్థాపింపబడింది. రాష్ట్రంలోని ప్రముఖ సంక్షేమ సంస్థలలో అది కూడా ఒకటి.

ఆ ఆశ్రయంలో 150 మంది యువతులు 75 మంది బాలలు ఏక కుటుంబంలాగా నివసిస్తున్నారు. భర్త గతించటం లేదా వదలి పెట్టటంవలన అనాథలైన ఆ యువతులు గత మూడేళ్ళనుండి తాము స్వతంత్రంగా జీవితం గడిపేందుకు దోహదమిచ్చే విజ్ఞానాన్ని, వృత్తులను నేర్చుకొంటున్నారు.

వారి చిన్నారి పాపలు నర్సరీ విధానం ద్వారా విద్య నభ్యసిస్తూ హాయిగా కాలం గడుపుతున్నారు. పగలంతా కులాసాగా జీవనోపాధి కవసరమైన వృత్తి నభ్యసించిన తల్లి, రాత్రిపూట తన శిశువును దగ్గరగా తీసుకొని ఈ ప్రపంచాన్నే మరచి సుఖంగా నిద్రిస్తుంది. తల్లి ఒడిలో పసిపాప నిర్భయంగా నిద్రిస్తాడు.

ఆ మహిళా పునరావాస సదనానికి ఇటీవల దశమ వార్షికోత్సవం జరిగింది. సుందరోద్యాన వనంలా కనబడే ఆ మందిరానికీ, ఆ సంక్షేమ కార్యక్రమం అంతటికీ మూల విరాట్ ప్రముఖ సంక్షేమ సేవా పరాయణురాలు శ్రీమతి జయలక్ష్మి ఆనందరావు.

మద్రాసు మెడికల్ కాలేజీలో పట్టభద్రురాలైన డాక్టర్ శ్రీమతి రావు, లండన్ విశ్వవిద్యాలయంలో ప్రజారోగ్యంలో డిగ్రీ సంపాదించింది.

మద్రాసు ప్రభుత్వ స్త్రీ సంక్షేమ డైరెక్టరుగా గత ఐదు ఏళ్ళుగా పనిచేస్తున్న డాక్టర్ జయలక్ష్మిరావు తాంబరం సేవా సదన్‌తో పాటు రాష్ట్రంలో పలు తావులలో 90కి పైగా చిన్న సమాజ సేవా కేంద్రాలను కూడా నిర్వహిస్తున్నది.

ఇటీవల ఆమె అమెరికాలో ఆరు నెలల పాటు పర్యటించి అక్కడి సంక్షేమ విధానాలను అవగాహన చేసుకొంది. ఐక్యరాజ్యసమితి ఫెలోషిప్ క్రింద సాంఘిక సంక్షేమంలో ఉన్నత శిక్షణ పొందేటందుకు ఎన్నుకోబడిన అయిదుగురు భారతీయులలో ఆమె ఒకర్తె.

ఈ రచయితతో జరిగిన ఒక ఇంటర్వ్యూలో, డాక్టరు రావు "స్నేహితులూ, దయార్ద్ర హృదయులూ అయిన అమెరికన్ల మధ్య నేను సంచరిస్తున్నాను. ప్రయివేటు,

ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాన్ని వారు కడు సమర్థనీయంగా నిర్వహించటం ముదావహం, అని అన్నది.''

వాషింగ్టన్ నగరంలో బీద స్త్రీలు పనికి వెళ్ళినప్పుడు, వారి పిల్లలను కనిపెట్టు కొని ఉండే జార్జిటౌన్ పరిసర మందిరం సంగతి ఆలోచిద్దాం. దానిని చాలావరకు స్వచ్ఛంద సేవికలు నడిపిస్తున్నారు. పూర్తిగా అక్కడే ఉద్యోగరీత్యా ఉండే ఒక నర్సు మినహా ఆ బాల విహారంలోని పని అంతా వాలంటీర్లే చేస్తుంటారు.

ఆ కార్యక్రమానికి సహాయం చేసే సదుద్దేశ్యంలో ఇళ్లు వాకిళ్లు పిల్లా జెల్లా గల తల్లులుఎన్నో మైళ్ళనుంచి కార్లమీద వచ్చి వెడుతూంటారు.

''వారు మనస్ఫూర్తిగా చేస్తున్న ఆ సేవను నేను ఎంతో గొప్పగా మెచ్చు కుంటాను'' అన్నది డాక్టర్ జయలక్ష్మి రావు.

అమెరికన్ ప్రజలు అలాంటి స్వచ్ఛంద కృషితోనే పాలపొడి, ఆహార పదార్థాలు ఈ దేశానికి పంపగలిగారు. ఈ రాష్ట్రంలో గత పది మాసాలలో కేవలం మహిళా సంక్షేమ శాఖద్వారానే 4000 పాలపొడి పెట్టెలు పేద బాలింతరాళ్లకూ, పిల్లలకూ పంచిపెట్టబడినవని అన్నదామె.

అమెరికాలో సంక్షేమ కార్యక్రమా లలో ప్రభుత్వము, ప్రయివేటు సంస్థలు కలిసి మెలిసి పని చెయ్యటం ఆమె కెంతో నచ్చింది. ''ఈ దేశంలో కూడా ఈ విధానం పట్టుదలతో పెంపొందింప చెయ్యాలి'' అని అన్నది డాక్టర్ రావు.

అమెరికాలో వ్యవసాయ క్షేత్రాలు, గ్రామీణ ప్రాంతాలు డాక్టర్ రావు సందర్శించినప్పుడు, విస్తృత కార్య క్రమాలు కడు సమర్థనీయంగా జరగటం చూసి ఆశ్చర్యపోయింది. మూరు మూల ప్రాంతాలలో కూడా మహిళలు వ్యవ సాయం, ఎరువుల ఉపయోగం, ఆరోగ్యం, సంక్షేమాలలో ఎన్నో క్రొత్త విధానాలు అవలంబిస్తున్నారు. ఆ ప్రాంతాలలోని ప్రసూతి శాలలు, శిశురక్షణ కేంద్రాలలో ఆధునిక పరికరాలు, సదుపాయాలు ఏర్పాటు చేయబడినవని అన్నదామె.

అమెరికాలోని కుటుంబ నియంత్రణ కేంద్రాలను కూడా ఆమె ఎంతో మెచ్చు కొంది. ఈ దేశంలో ఆ కేంద్రాలను అంత విజయవంతంగా కొనసాగించాలంటే ప్రజలు సాంఘిక విద్య చాలా ఎక్కువగా అభ్య సించాలి. సంతానాభివృద్ధికి, నిరోధానికీ కూడా ఆలుమగలు నిరాఘాటంగా ఆ కేంద్రాలకు వెళ్లి సలహాలు పొందుతూ ఉంటారు అక్కడ.

సాంఘిక సంక్షేమ కార్యక్రమంలో

ఆమెకు నచ్చిన మరో అంశం వికలాంగు లైన బాలల పట్ల తీసుకోబడుతున్న శ్రద్ధా సక్తులు.

"శారీరకంగా దెబ్బతిన్న అంటే విక లాంగులైన బాలురకోసం ప్రత్యేక సంస్థలు స్థాపించాలన్న ఈ తక్షణ సమస్యను భారత దేశం ఎదుర్కొనవలసి ఉన్నది" అన్న దామె.

అనాధ బాలలకు ఆశ్రయాలు కల్పిం చటం కూడా ఈ దేశంలో విరివిగా సాగా లని ప్రతి భారతీయుడు వాంఛిస్తాడు.

ఈ దేశంలో దీర్ఘవ్యాధిగ్రస్థుల వైద్య సమస్య మనసులో మెదులుతున్న ఆ డాక్టరుకు అమెరికాలోని గృహ చికిత్సా (హోమ్ కేర్) విధానం ఎంతో నచ్చింది. ఆస్పత్రులు, వైద్యకేంద్రాలలోని రద్దీ దాని మూలంగా ఎంతో తగ్గిపోతుం డంటుందామె.

గత మే నెలలో షికాగోలో జరిగిన సంక్షేమ సేవ తాలూకు 85వ జాతీయ సమావేశంలో పాల్గొనే అవకాశం డాక్టర్ జయలక్ష్మీ రావుకు కలిగింది. అమెరికా లోని తదితర డాక్టర్లతో కలిసి మెలిసి పరస్పరం సమస్యలు చర్చించుకొనే అవ కాశం ఆమెకు లభించింది.

తాను అమెరికాలో ఉన్నప్పుడు అక్కడి అతిథేయులు తనను అన్నివిధాలా ఆదరించి తనకు ఏ విధమైన లోటు రాకుండా చూడటం వలననే తన పర్యటన అత్యంత విజయవంతంగా కొనసాగిందని డాక్టర్ జయలక్ష్మీరావు తన కృతజ్ఞత వ్యక్తంచేసింది.

# సంపాదకీయములు

## ప్రజల దైనికావసరాలు

ఇండియా వైస్ ప్రెసిడెంటు డా॥ రాధాకృష్ణన్‌గారు ఉపన్యసిస్తూ ప్రజలకు దైనిక జీవితావసరాలను సమకూర్చడంలో త్యాగదృష్టి అవసరమన్నారు.

అధికారంలో నుండిగాని, బయటనుండిగాని ప్రజాసేవ తలపెట్టిన ప్రతివారు ప్రజల జీవితావసరాలను సమకూర్చే సందర్భమున ఆ సమస్యకు తాము అంకితమయిపోయి వాస్తవిక పరిస్థితుల దృష్ట్యా ప్రజల అవసరాలను తీర్చగలుగాలి.

ప్రజల జీవితావసరాలు అమరడానికి రైతులు, కార్మికులు, వ్యాపారస్థులు మొదలైనవారి సహాయ సహకారము లత్యవసరము. వారిని నష్టపడి తల్లక్రిందులై ప్రజల నుద్ధరించవలసినదిగా ఎవరు కోరడంలేదు. కాని తాము తమ కృషికి ఫలితముగా ఆశించే ప్రతిఫలంలో అధికభాగం ప్రజలకు త్యాగంచేస్తే యీనాడు ప్రజావసరాలకు ఏర్పడిన కొరత యింత తీవ్రముగా నుండదు. ప్రజలజీవితావసరాలు పరస్పర సానుభూతి, సద్భావముల వాతావరణంలో త్యాగఫలితంగా సమకూరడం వాంఛనీయము.

## ప్రణాళిక సాఫల్యానికి మహిళల తోడ్పాటు

దేశంలో పంచవర్ష ప్రణాళికలను విజయవంతంగా నమలుపరచడం మన జాతీయ సాధనసంపత్తిమీదనే కాక ప్రజలు శ్రద్ధాసక్తులపైన, దృఢప్రథముపైన ఆధారపడియున్నదని కేంద్ర డిప్యూటిమంత్రి శ్రీమతి లక్ష్మీమీనన్ ఉద్బోధించారు.

ప్రణాళిక సాఫల్యానికి ప్రజల సహాయ సహకారములు అత్యవసరమైనవి. జాతీయ పునర్నిర్మాణమునకని నిర్దేశించబడిన ప్రణాళికల నిర్వహణకు యావత్ప్రజానీకపు సహాయ సహకారములను సేకరించి లక్ష్యసిద్ధిని సాధించవలసిన బాధ్యత ప్రభుత్వముది. ముఖ్యంగా స్త్రీలు పొదుపు ఉద్యమంలో ప్రముఖపాత్ర వహించవచ్చును. సంక్షేమ కార్యకలాపాలలోను, వైద్య, విద్యారంగాలలోను, కుటీరపరిశ్రమల అభివృద్ధి పథకాల నిర్వహణలోను స్త్రీలు ఎంతైనా కృషిచేయుట కవకాశమున్నది.

స్త్రీ తన సహజ లావణ్య, సౌకుమారములు నశించకుండా జాతీయ శ్రేయోసౌభాగ్యములకు తోడ్పడగల ఏ వృత్తిని అవలంభించినా ప్రణాళికా సాఫల్యానికి తోడ్పడినట్లే కాగలదు. మన జాతీయ సమస్యలను వాస్తవికత కనుగుణ్యంగా అర్థము చేసికొని, వాని పరిష్కారమార్గాలపట్ల ఆసక్తి చూపుతూ పురుషులతోబాటు స్త్రీలు కృషిచేయడం జాతీయ పునర్నిర్మాణమునకు విశేషముగా తోడ్పడగలదు.

——(౦)——

---

ముఖచిత్రం :

జెమినీవారి చిత్రం 'విజయకోటవీరుడు'లో పద్మిని




గాంధీమహాత్ముడు : ఆంధ్రానువాదము శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు. ప్రచురణకర్తలు : కల్చరల్ బుక్స్ ప్రైవేట్ లిమిటెడ్. 31 మీరాసాహెబ్ వీధి, మౌంటురోడ్డు, మద్రాసు-2. వెల రు. 1-50.

ప్రఖ్యాత ఫ్రెంచి రచయిత రోమాంరోలా భారత జాతీయోద్యమ విశిష్టతను గురించి, గాంధిమహాత్ముని పాత్రను, సహాయ నిరాకరణోద్యమ నైతికస్థాయిని వివరిస్తూ 1924లో రచించిన గ్రంథమునకిది ఆంధ్రానువాదము. గాంధీజీ, ఆయన నాయకత్వము, స్వాతంత్ర్యోద్యమము మన యుగంలోవే అయినా సుప్రసిద్ధ పాశ్చాత్య రచయిత విద్యావేత్త దృష్టిలోని మన జాతీయ నాయకత్వము, జాతీయ సమరముల స్వరూపమును యీ గ్రంథము వివరించుచున్నది.

—(o)—

## శ్రీ విళంబినామ సం॥ర కార్తీక, మార్గశిర మాసములు

| నెల | తేదీ | వారం | వివరాలు |
|---|---|---|---|
| నవంబరు నెల 1958 సం॥ | 16 | ఆ | షష్ఠి 40_11 ఉషా 39_12 |
| | 17 | సో | సప్త 49_27 శ్రవ 39_46 |
| | 18 | మం | అష్ట 50_14 ధని 41_44 శాల్యజాల్యభావః |
| | 19 | బు | నవ 51_58 శత 45_46 |
| | 20 | గు | ద 55_23 పూభా 49_3 |
| | 21 | శు | ఏ 60_0 ఉభా 54_15 |
| | 22 | శ | ఏకా 0_45 రే 60_0 |
| | 23 | ఆ | ద్వా 5_41 రే 0_30 |
| | 24 | సో | త్ర 11_9 అశ్వ 7_2 |
| | 25 | మం | చతు 15_30 భర 13_31 జ్వాలాతోరణం |
| | 26 | బు | ○ పౌ 19_3 కృ 19_10 కృత్తికాదీపం |
| | 27 | గు | కృపా 22-58 రో 24_19 |
| | 28 | శు | విది 26_5 మృ 28_41 |
| | 29 | శ | తది 28_12 ఆర్ద్రా 32_5 |
| | 30 | ఆ | చ 29_9 పున 34_23 |
| డిసెంబరు నెల 1958 సం॥ | 1 | సో | పం 28_52 పుష్య 35_26 కార్తీక సోమవారవ్రతం |
| | 2 | మం | షష్ఠి 27_16 ఆశ్లే 25_13 |
| | 3 | బు | సప్త 24_30 మఖ 33_54 సావిత్రికల్పః |
| | 4 | గు | అష్ట 20_35 పూఫ 31_26 |
| | 5 | శు | నవ 15_46 ఉఫ 23_6 |
| | 6 | శ | ద 10_10 హస్త 24_4 |
| | 7 | ఆ | ఏ 4_6 ద్వా 53_40 చి 19_39 |
| | 8 | సో | త్ర 51_24 స్వా 15_4 |
| | 9 | మం | చతు 45_23 విశా 10_35 మాసశివరాత్రి |
| | 10 | బు | ● అమా 39_55 అనూ 6_27 |
| | | | **మార్గశిరమాసము** |
| 1958 సం॥ | 11 | గు | శుద్ధపా 35_17 జ్యే 3_0 |
| | 12 | శు | విది 31_37 మూల 0_21 పూషా 58_5 |
| | 13 | శ | తది 29_8 ఉషా 58_7 |
| | 14 | ఆ | చ 27_50 శ్రవ 58_57 |
| | 15 | సో | పం 27_50 ధని 60_0 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10   6 ఔ॥ రు. 5-50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

(తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత, సంభవించును.

బుడ్డి రు. 4-0

## కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్‌కు ఏజంట్లు:

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.

భారత ప్రశస్తి

THE PRIDE of INDIA




# LODHRA

FOR LADIES' HEALTH

**KESARI KUTEERAM Private LTD.**
MADRAS-14.

లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి

LODHRA PRESS, MADRAS-14.